# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# ఆరవ సంవత్సరం....



అమెరికా రాయబారి ప్రొఫెసర్ జె. కె. గాల్‌బ్రెత్ సర్సాపూర్‌లో బడిపిల్లల మధ్యాహ్న భోజన పథకానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్ర ప్రదేశ్ తొలి అయిదు సంవత్సరాలూ, రెండవ ప్రణాళికా వికకాలంలో గడిచాయి. మన రాష్ట్రంలో రెండవ ప్రణాళిక కేటాయింపును మించి రూ. 14 కోట్లు అధికంగా ఖర్చు పెట్టగలిగాము. రాష్ట్రపు ఆరవ సంవత్సరం కూడా, రూ. 305 కోట్ల మూడవ ప్రణాళికా లక్ష్యాలను సాధించడానికై అదే అభివృద్ధి క్రమంలో పురోగమించింది.

★ భారీ ప్రాజెక్టు అయిన నాగార్జున సాగర్‌కు క్రిందటి సంవత్సరం మొదట రూ. 9 కోట్లు ఖర్చు పెట్టాలనుకొనగా సుమారు రూ. 10 కోట్లు ఖర్చు చెయ్యడం జరిగింది.

★ రాష్ట్రంలో సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించడానికై రూ. 3 కోట్ల పెట్టుబడి ధనంతో నెలకొల్పబడిన పారిశ్రామికాభివృద్ధి సంస్థ, పది ప్రాజెక్టుల పరిశీలనను చేపట్టింది. వీటికి సుమారు రూ. 19.65 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా.

★ లఘు పరిశ్రమల అభివృద్ధికై ప్రత్యేకంగా ఒక సంస్థను స్థాపించడం జరిగింది. దీనికి ప్రభుత్వం, వాటాధనంగా రూ. 20 లక్షలు, ఋణంగా రూ. 35 లక్షలు ఇచ్చింది.

★ రాష్ట్ర గనుల అభివృద్ధి సంస్థ క్రిందటేడు పని ప్రారంభించింది. కృష్ణా జిల్లాలో ముడి ఇనుము నిలువలను వెలికి తీసే కార్యక్రమంలో ఇది నిమగ్నమై ఉంది. ఈ ప్రాంతంలో 1961 డిసెంబరులో గనుల త్రవ్వకం ప్రారంభించి, లక్ష టన్నులకు పైగా ముడి ఇనుమును త్రవ్వి తీయడం జరిగింది. ఇంకా అనేక ఖనిజాలను వెలికి తియ్యడానికి, అస్బెస్టాస్, రాగి, గ్రాఫైట్ మొదలైనవాటి విషయంలో విస్తారంగా పరిశోధనలు గావించడానికి కూడా యీ సంస్థ పెక్కు పథకాలను సిద్ధం చేసింది.

★ సమాజాభివృద్ధి కార్యక్రమం 2.37 కోట్ల జనాభాతో 83,415 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఆవరించివున్న 24,417 గ్రామాలలో అమలుపరచబడింది. రాష్ట్రంలో 378 అభివృద్ధి మండలాలను ఏర్పాటు చేశారు.

★ నిర్బంధ ప్రాథమిక విద్యా పథకంతోపాటు, బడికి వెళ్ళే పిల్లలకు మధ్యాహ్న భోజనం సరఫరా చేయడానికి సంబంధించిన రెండు పథకాలను కూడా ప్రవేశపెట్టడం జరిగింది.

మూడవ ప్రణాళికా పథకాలన్నింటికీ అవసరమైన సాధన సంపత్తులను సమకూర్చుకోడానికి నూతన చర్యలు తీసుకుంటున్నారు. అయితే నిశ్చయంగా దీని విజయం మాత్రం, దృఢ సంకల్పబద్ధులైన ప్రజల స్వేచ్ఛాపూర్వక సహకారంపైననే ప్రధానంగా ఆధారపడి ఉంది.

—స. పౌ. సం. శాఖ, ఆం. ప్ర.

# వాటర్‌బరీస్

ఎఱ్ఱ లేబులు

# కాంపౌండు

దగ్గులకూ రొంపలకు దీనిని




ఎంచుకొనడానికిగల నాలుగు కారణాలు

| | | | |
|---|---|---|---|
| **1** వాటర్ బరీస్ కాంపౌండు దగ్గులనూ, రొంపలనూ సత్వరం, ఫలప్రదంగా నిర్మూలిస్తుంది. | **2** వాటర్ బరీస్ కాంపౌండు లోగల క్రియోసోట్స్, గయోకాల్ అనేవి, ఊపిరితిత్తులను శుభ్రం చేయడంలో సాయపడతాయి. | **3** వాటర్ బరీస్ కాంపౌండు కేవలం మందే కాదు, ఒక అద్భుతమైన టానిక్ కూడా. శరీరానికి వ్యాధి నిరోధక శక్తి సమకూర్చడంలో సాయపడుతుంది. | **4** వాటర్ బరీస్ కాంపౌండు ఆకలిని పెంచుతుంది, జీర్ణ శక్తిని వృద్ధిచేస్తుంది. రక్తాన్ని శక్తివంతంచేస్తుంది. వృధాఅయిన లవణాలను తిరిగిసమకూరుస్తుంది |

# వాటర్‌బరీస్ కాంపౌండు

**ఎర్ర లేబిలు**

వార్నర్—లాంబర్ట్ ఫార్మాసుటికల్ కంపెనీ ( మితబాధ్యతలతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడింది )

# పాఠకుల లేఖలు

## ఆగష్టు 1962

శ్రీ ఉత్పల సత్యనారాయణగారు మా టౌన్ లైబ్రరీకి విచ్చేసి, మా కోరికపై "గంగావతరణం" అంతా చదివి వినిపించారు. వారికి మీ పత్రిక ద్వారా ధన్యవాదాలు.

—సి. ఎస్. విజయకుమార్‌రెడ్డి, అలువాల

నాకు 4 సం॥ల కుమారుడు కలడు. ఈ అబ్బాయి ఎల్లప్పుడు, మామ, మామ! అని రోదన చేయుచుండును. అప్పుడు "చందమామ" ఇచ్చిన బొమ్మలను చూచుకుంట వుండును. ఇతర పుస్తకములు యిచ్చిన ఎడల తీసుకొనడు.

—ఎం. చెన్న బసయ్య, శంకరగిరి

"బుద్ధి రవాణా" చాలా బాగున్నది. "రాకాసి లోయ" అద్భుతముగా నున్నది. పరోపకారి పాపన్నకు రాజ సన్మానము కూడా చాలా బాగున్నది.

-జి. కొండయ్య నాయుడు, బెండమూర్లంక

"చందమామ" ఆలస్యానికి ఆందోళన చెందిన నేను, అంతులేని అంధకారం అంబరాన అలుము కొన్నట్టుగా బాధపడ్డాను. అంతలోనే "చందమామ" అందమైన రంగుల అంగుతో అందంగా అరుదెంచగానే, ఆహా! అనుకుంటూ "గుండమ్మ కథ" చూసినట్టుగా ఆనందించాను.

—అడపా చిదానందశ్రీ, విశాఖ

"చందమామ" కు "రాకాసిలోయ" వెన్నెల వంటిది.

—డి. శ్రీనివాసాచారి, అలువాల










తప్పక
చూడండి!
గౌతమి ప్రొడక్షన్స్ వారి
మహామంత్రి
తిమ్మరుసు
దర్శకత్వం: కె. కామేశ్వరరావు బి.ఎ.,
రచన: పింగళి .... సంగీతం: పెండ్యాల
ఆంధ్ర సీడెడ్ నైజాం
డిస్ట్రిబ్యూటర్స్: గౌతమి పిక్చర్స్ భాస్కర్ పిక్చర్స్ వాణీ ఫిలిమ్స్
CHITRALEKHA
STUDIO




హాయి గొలిపే పరిశుభ్రంగా వుండండి! లైఫ్‌బాయ్‌తో
స్నానంవల్ల ఉత్సాహంతో ఉప్పొంగి పొండి! జ్ఞాపక
ముంచుకోండి, స్నానం చేయునప్పుడు లైఫ్‌బాయ్ మురికిలో
గల క్రిములను కడిగివేయును — ఎంతో ఆరోగ్యవంత
మైన హాయి గొలుపును! ఔను, లైఫ్ బాయ్‌తో
కుటుంబంలో అందరి జీవితం ఆరోగ్యవంతం.

**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యము వున్నది!**

L.33-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

# దేనినిగూర్చి వారంత తన్మయులై యున్నారు?...



దీ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ లో
ఒక సేవింగ్స్ బ్యాంక్ ఎక్కవుంటు—
వారికి ఒక స్వంత పాస్ బుక్! నిలవయుంచిన
మొత్తములు పెరుగుచుండగా గమనించుట ఎంత ఆనందకరం!!
...జీవితంలో చిన్నతనమందే
సొమ్మును నిలవ చేసికొను అలవాటును
చిన్న పిల్లలు అలవర్చుకొందురుగాక.

ప్రత్యేక సౌకర్యము ■ సంవత్సరమునకు మీకు **100 చెక్కులు:** ఎప్పుడు కావలసిన అప్పుడు, ఎంత సొమ్మునయిన, ముందుగా నోటీసీయ నక్కరలేకుండగనే తీసికొనవచ్చును—మరి, మీరు నిలవయుంచిన ధనమునకు సంవత్సరమునకు 3% చక్రవృద్ధి వచ్చునుగదా.

## ది బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్

టి. డి. కన్సారా, జనరల్ మేనేజర్

B/C/97/TL.










రుచిగా, ఎల్లప్పుడూ కరకర లాడుతూ ఉండే జె. బి. సాల్టో బిస్కట్లు యిప్పుడు సొగసైన రంగులుగల 450 గ్రాముల డబ్బాలలో ప్యాకుచేయబడినవి. సాల్టో బిస్కట్లను తినండి మరియు డబ్బాలను యింట్లో వాడుకోండి!

**జె. బి. మంఘారామ్ అండ్ కంపెనీ**

గ్వాలియర్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి కొత్త గేయకథ "కుమారసంభవము" ప్రారంభ మవుతున్నది.

"పరోపకారి పాపన్న" కథలు ఎవరు రాశారని చాలామంది పాఠకులు అడుగుతున్నారు. అవి రాసిన వారు మా కార్యాలయంలో పని చేసే ఎం. రంగారావు గారు. "గుండు భీమన్న" కథలు కూడా వీరు సేకరించి సవరణ చేసినవే.

లోగడ రంగుల బొమ్మల సీరియల్ కథలు 18 మాసాలలో ముగుస్తూ వచ్చాయి. ఈసారి "రాకాసి లోయ" ఇంకా ఎక్కువ మాసాలు నడుస్తుందని పాఠకులకు తెలియ జేస్తున్నాము.

సంపుటి : 31 అగష్టు 1962 సంచిక : 2

Sankar...



# భారత చరిత్ర



గుప్త సామ్రాజ్యం అడుగంటటంతో హూణులనే మంగోలియా జాతివారు కొన్ని ప్రాంతాల తమ ప్రతిభను స్థిరపరుచుకున్నారు. వీరు క్రూరులు, అనాగరికులు. 5, 6 శతాబ్దుల సంధికాలంలో వీరి ప్రభ బాగా సాగింది. హూణ పరిపాలనను విస్తరించిన రాజులలో ప్రసిద్ధులు తోరమానుడనేవాడూ, అతని కొడుకు మిహిరకులుడనేవాడూనూ. హూణుల విజృంభణను అణచినవాడు దశపుర రాజైన యశోధర్ముడు.

6వ శతాబ్దం ఉత్తరార్థం నాటికి ఉత్తర భారతదేశంలో మౌఖరి వంశపు రాజులూ, దక్షిణ భారతంలో చాళుక్యులూ ప్రముఖులుగా ఉన్నారు.

మౌఖరులు తమ మూల పురుషుడు పురాణయుగపు అశ్వపతి అని చెప్పుకునేవారు. వీరిలో తొలిగా ప్రసిద్ధికి వచ్చి మహారాజాధిరాజ బిరుదం పెట్టుకున్నవాడు ఈశానవర్మ. ఇతను ఆంధ్రులనూ, శూలికులనూ, గౌడులనూ జయించినట్టు క్రీ. శ. 554 నాటి శాసనం ఉన్నది. (శూలికులంటే చాళుక్యులు కావచ్చు) మౌఖరివంశీయులు కూడా విదేశీయుల నెదిరించి పోరాడారు.

ఈశానవర్మ అనంతరం శర్వవర్మ, అవంతివర్మ, గ్రహవర్మ అనేవారు వరసగా రాజ్యం పాలించారు.

గ్రహవర్మ భార్య రాజ్యశ్రీ. ఈమె పుష్యభూతి వంశానికి చెందిన స్థానేశ్వరరాజు ప్రభాకరవర్ధనుడి కుమార్తె. ఈమెకు రాజ్యవర్ధనుడనీ, హర్షుడనీ ఇద్దరు సోదరులుండేవారు. రాజ్యశ్రీ భర్త అయిన గ్రహవర్మ మాళవరాజు చేత హత్య చేయబడ్డాడు. అప్పుడు రాజ్యశ్రీ అన్న అయిన రాజ్యవర్ధనుడు తన చెల్లెలి వైధవ్యానికి ప్రతీకారం చేశాడు గాని, కుట్ర చేసి గౌడరాజైన శశాంకుడనేవాడు అతన్ని హత్య చేశాడు.

## 11. హర్ష చక్రవర్తి



ఈ విధంగా ఖాళీ అయిన స్థానేశ్వర సింహాసనానికీ, మౌఖరీల రాజ్యానికీ హర్షుడు వారసుడయాడు. 606 లో హర్ష పరిపాలన ఆరంభమయింది.

ఇతను అయిష్టంతో సింహాసనం ఎక్కినట్టు కనిపిస్తుంది. కాని ఇతని పరిపాలన కూడా భారత చరిత్రలో ఒక సువర్ణ ఘట్టం. ఇతని రాజధాని కనౌజ్.

హర్షుడు ఆరేళ్ళపాటు శత్రువులను పరిమార్చటంలో గడిపి, 612 లో తన సామ్రాజ్యాన్ని భద్రపరచుకుని చక్రవర్తినని ప్రకటించుకున్నాడు.



634 కు పూర్వం హర్షుడు దక్షిణ దిగ్విజయానికి బయలుదేరినట్టున్నూ, వాతాపిని ఏలే చాళుక్యరాజు రెండవ పులకేసి హర్షుణ్ణి నిరోధించినట్టూ తెలుస్తున్నది. అయితే పులకేశి మరణానంతరం 643 లో హర్షుడు దక్షిణ దిగ్విజయం చేస్తూ గంజాం (ఒరిస్సా) దాకా వచ్చాడు.

హర్ష సామ్రాజ్యానికి కేంద్రమైన కన్యాకుబ్జం గంగ యొక్క తూర్పుతీరాన ఉండేది. ఇది బలమైన రక్షణలతో కూడినదనీ, గొప్ప హర్మ్యలతో కూడినదనీ చీనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ వర్ణించాడు. ఎక్కడ చూసినా ఉద్యానవనాలూ, మంచి నీటికోనేరులూ ఉండేవి. పౌరులు విద్యావంతులు, ధనవంతులు. నగరములో సిరిసంపదలు వెల్లివిరిశాయి.

హర్షుడు చీనాతో సన్నిహిత రాయబార సంబంధాలు పెట్టుకున్నాడు. బౌద్ధక్షేత్రాలు చూడవచ్చిన చీనా యాత్రికుడూ, న్యాయశాస్త్రవేత్తా అయిన హ్యూన్‌త్సాంగ్‌తో ఆయనకు పరిచయం అయింది. హర్షుడు శైవం వదలి పెట్టకుండానే గాఢమైన బౌద్ధ మతాభిలాష ప్రదర్శించాడు. మాంసాహారమూ, ప్రాణిహింసా నిషేధించాడు. అనేక వసతి గృహలూ, మఠాలూ ఏర్పాటుచేసి, విరివిగా దాన ధర్మాలు జరిపాడు.

643 లో హర్షుడు కన్యాకుబ్జంలోనూ, ప్రయాగలోనూ రెండు అపూర్వ సమ్మేళనాలు జరిపించాడు. ఈ రెంటికీ చీనా యాత్రికుడు వెళ్ళాడు. కన్యాకుబ్జ సమ్మేళనం మహాయాన బౌద్ధం యొక్క ప్రాశస్త్యాన్ని, హ్యూన్‌త్సాంగ్ ఔన్నత్యాన్ని లోకానికి ప్రదర్శించటానికి జరపబడింది. ఈ సమ్మేళనంలో 20 మంది రాజులూ, అనేక వేలమంది బౌద్ధ, బ్రాహ్మణ, జైన మత వేత్తలూ పాల్గొన్నారు. ప్రయాగ సమ్మేళనానికి 5 లక్షలమంది, మారుమూలల నుంచి కూడా, ఆహ్వానించబడి హర్షుడి వద్ద కానుకలు పొందారు. సమ్మేళనం మూడు రోజులు జరిగింది. మూడు రోజులూ వరసగా బుద్ధుడి, సూర్యుడి, శివుడి ప్రతిమలుంచబడ్డాయి. అయిదేళ్ళపాటు సంపాదించినదంతా హర్షుడు ఆహూతులకు దానం చేసేసి, పాత బట్టలు ధరించి బుద్ధుణ్ణి ఆరాధించాడు.

హర్షుడు 40 ఏళ్ళు పరిపాలించి 646 ప్రాంతంలో దేహం చాలించాడు. విచ్ఛిన్నమైపోయిన ఉత్తర భారతంలో సక్రమ, న్యాయ పరిపాలన ఏర్పాటు చేశాడు. అందరికీ సమంగా న్యాయం జరిగింది. ఆయన రాజధాని అయిన కన్యాకుబ్జం "మహోదయశ్రీ" అనే పేరుతో ఆయన అనంతరం కూడా గొప్పకీర్తి దక్కించుకున్నది. ఆయన విఫలుడయింది, దక్షిణ దేశాన్ని లోబరచుకోవటంలో మాత్రమే.

హర్షుడు తనకు పూర్వులైన సముద్రగుప్తుణ్ణీ, అశోకుణ్ణీ అనుకరించ యత్నించాడు. పాశ్చాత్య చరిత్రకారులు హర్షుణ్ణి "హిందూయుగపు అక్బర్" అన్నారు. ఆయన ఆస్థానంలో బాణుడూ, మయూరుడూ, దివాకరుడూ, హ్యూన్‌త్సాంగ్ మొదలైన మేధావులుండేవారు. హర్షుడే స్వయంగా గొప్ప గ్రంథకర్త. ఆయన రచనలు కొన్ని నిలిచి ఉండటం మన అదృష్టం.





# కుమారసంభవము

ప్రథమాశ్వాసము :

అత్తవా రింటిలో
అఖిల సుఖములతోడ
ఇల్లటపు టల్లుడై
ఈశ్వరుండున్నాడు.

జమిలి పాములతోడి
సాకతము విడనాడి,
కాంచనాభరణములు
కైసేసికొనె శివుడు!

గజ చర్మమును విడిచి
కనకాంబరము కట్టి,
పునుక పేరులు తీసి
పూలు దాల్చెను శివుడు!

బూది పూతలు మాని,
పాలుపుగా కస్తూరి
మంచి గంధము కలిపి
మై పూసికొనె శివుడు!

గౌరి కూర్చొని కాలి
గజ్జెలను కట్టుకొను
నంతలోననె నాట్య
మాడ దొడగును శివుడు!

సంజవేళల తనదు
సతితోడ నందిపై
అపుడపుడు విహరింప
అరుగుచుండును శివుడు!

శివుడు రెండవ చిత్త
భవునివలె కన్పించె!
హైమవతి అల రతీ
రామయే యనిపించె!

ప్రియుని తోడిదె లోక
మయి మెలగె హైమవతి;
హైమ తోడుత తన్ను
తా మఱచె నీశ్వరుడు.

ఉత్పల సత్యనారాయణాచార్య



అచట నున్న రుద్ర భటుల
ఆగడముల నే మందును!
అచ్చుపోసి విడిచినట్టి
అబోతులె నయమందును!

తమ కెదు రెవ్వరు లేరని
ప్రమథులు చెలరేగినారు;
ఊరంతయు కలయదిరిగి
ఒక కొలికికి తెచ్చినారు!

అప్సరసలు ప్రియులతోడ
అరుగునపుడు రుద్రభటులు
వెలి బూదిని కనుల జల్లి
పులి తోళ్లను కప్పు చుంద్రు.



విద్యాధర గంధర్వుల
వెంట దగిలి, మెడలు విఱిచి
లింగాలను అంట గట్టి
జంగములను చేయుచుంద్రు.

దేవకన్య లా త్రోవల
తిరుగునపుడు రుద్రభటులు
భూతములై దడిపింతురు;
ప్రేతములై బెదరింతురు.

హిమగిరిపై అడుగుపెట్ట
అమరులు గజగజలాడిరి;
ప్రమథుల పోకిళ్ల నెల్ల
అమరపతికి ఎఱిగించిరి.

దేవ గురువుతో ఇంద్రుడు
దీర్ఘాలోచన చేసెను;
అగ్నిదేవు పిలువనంపి
అనతిచ్చె నీ రీతిగ—

"ఓయి నీవు శివుని కడకు
ఒంటరిగా పోవలయును,
తిన్నగ ప్రమథుల చేష్టలు
విన్నవించి రావలయును.

శివు డుగ్రుడు, నిను భస్మము
చేయునంచు భయమందకు;
బూడిదయగుటకు మరుడవ?
ప్రోజ్జ్వల వైశ్వానరుడవు!



నిర్భయముగ పోయిరమ్మ
నేడే,"యని దేవేంద్రుడు
ధైర్యమొదవునట్లు చెప్పి,
తాంబూలం బిచ్చి పంపె.

ధూమధ్వజమెత్తి, జంట
మోములతో అగ్నిహోత్రు
డిమ్ముగ తన పొట్టేలును
ఎక్కి బయలుదేఱినాడు.

హిమగిరిపై మును లగ్నికి
నమస్కారములు చేసిరి;
శివ పార్వతులున్న చోటు
చెప్పి యటకు పంపించిరి.

గుమ్మముకడ నందీశుడు
కునికిపాట్లు పడుచుండెను;
ఈశు డపుడు పార్వతితో
ఏకాంతమునం దుండెను.

గువ్వగూండ్ల పావురాళ్ళు
గునిసి యాడుచుండె నపుడు;
పార్వతి శృంగారించుక
పరమేశుని చేరె నపుడు.

అపు డచ్చటి కగ్నిహోత్రు
డడ్డులేక వచ్చి నిలిచె:
శివ పార్వతులకు కోపము,
సిగ్గును తోడ్తోడ కలిగె.



"మూర్ఖా!"యని పరమేశుడు
మూడవ కను దెరచినాడు;
అగ్నిహోత్రు డే మాత్రము
అదురులేక నిలిచినాడు.

అగ్నియేమొ విన్నవించు
నంతలోనె పరమేశుడు
ఆగ్రహమున తన శక్తిని
అగ్నిపయిని వైచినాడు.

అంతలోన విలవిలమని
అగ్నిహోత్రు డలమటించి,
కుప్పగూలి మూర్ఛిల్లెను,
కొంతవడికి తెప్పిఱిల్లె.

అగ్నిహోత్రుఁడా శక్తికి
అట్టుడికిన యట్టుడుకుచు
శివు నేమియు ననజాలక
శిరము వంచి వెడలిపోయె.

ఎట్టులో తన పాట్టేలును
ఎక్క అగ్ని చనుచుండగ,
దాని తోక మెలియబెట్టి
తఱిమినారు రుద్రభటులు.

ఈ విధముగ అగ్నిహోత్రు
డరిగి బ్రహ్మకడకు చేరి,
తనదు దుఃఖపాటు నెల్ల
వినిపించెను దీనమ్ముగ.

బ్రహ్మయు నాలోచించెను,
పల్మా అగ్నిని చూచెను,
పక్కున ఒక నవ్వు నవ్వి
పలికె నిట్లు ఆదరముగ:

"అగ్నిహోత్ర! దుఃఖింపకు;
ఆ శివునికి నీకు నుంత
భేదము లేదంచు ఎల్ల
వేదవిదులు చెప్పుచుంద్రు.

నిజమునకా శివశక్తిని
నీ వొకడవు, గంగ యొకతె
భరియింపగ జాలువారు,
పరమ పుణ్యులైనవారు!

అయ్యది భరమైనయెడల
ఆ హిమాలయమున కేగి,
గంగలోన శివశక్తిని
కలిపి రమ్ము శీఘ్రమ్ముగ."

అని పలికిన అగ్నిహోత్రు
డల్లెయని యింటికేగి,
సతితోడుత గంగలోన
స్నానమాడ బయలుదేఱె —(సశేషం)






## 14

[అరణ్యంలో కేశవుడూ వాళ్ళకు, బ్రహ్మదండి మాంత్రికుడు తన అంగరక్షకులతో రావటం కనిపించింది. వాళ్ళు, బ్రహ్మదండిని చెట్టు కొమ్మకు వేలాడదీసి, వాళ్ళ గుర్రాలను ఎక్కి పారిపోసాగారు. పల్లెప్రజలు వెంబడించారు. ఒక కోయకులపెద్ద వాళ్లకు అభయం యిచ్చి, వాళ్లను ఒక రహస్యప్రదేశానికి తీసుకుపోసాగాడు. తరవాత—]

కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ, కోయనాయకుడి వెంట దారీ డొంకాలేని మహారణ్యంలో పడి ఒక గంటకాలం నడిచారు. అంతా అంధకారం; కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. తామెవరో నిజం తెలిస్తే, ఈ కోయవాడు తమను రాజభటులకు అప్పగిస్తాడేమోనన్న అనుమానం ముసలివాణ్ణీ, తతిమ్మా యిద్దర్నీ బాధించసాగింది. ప్రస్తుతానికి బ్రహ్మదండి నుంచి ప్రమాదం తప్పింది కనక, తాము గుర్రాలెక్కి పారిపోవటం క్షేమమేమో అన్న ఆలోచన ముసలివాడికి కలిగింది.

ఈ ఆలోచన రహస్యంగా కేశవుడికీ, జయమల్లుకూ చెప్పాడు ముసలివాడు. కాని, వాళ్ళు దానికి ఒప్పుకో లేదు. చీకట్లో తామెటు పోతున్నదీ తెలుసుకోకుండా, పారిపోవటం ప్రారంభిస్తే, తాము తిరిగి బ్రహ్మపుర నగర పరిసరాలకే వెళ్ళే అవకాశం వున్నదనీ, అప్పుడు తమకు తప్పక ప్రమాదం కలుగుతుందనీ వాళ్ళు అన్నారు.




అందరికన్న ముందు నడుస్తున్న కోయల కుల పెద్ద, ఒక మహా వృక్షం కింద ఆగి, తన చేతనున్న ఈటెతో, దాని బోదె మీద మూడుసార్లు గట్టిగా కొట్టాడు. ఆ వెంటనే, చెట్ల చాటు నుంచి, "ఆగండి! ఎవరు?" అన్న ప్రశ్న భీకరంగా వినిపించింది.

కోయనాయకుడు ఈటెను పైకెత్తి, "గడే జంగ్, గడేజంగ్!" అంటూ రెండుసార్లు బిగ్గరగా అరిచాడు. మరుక్షణంలో ఇద్దరు కోయయువకులు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "జంగ్‌దొరా, ఏం సెలవు?" అంటూ తలలు వంచి నిలబడ్డారు.

"వీళ్ళు ముగ్గురూ బాటసారులు. బంది పోట్ల నుంచి పారిపోయివచ్చి, మన రక్షణ కోరినవాళ్ళు. వీళ్ళను తెల్లవారే వరకూ కాపాడవలసిన బాధ్యత మనది. పోతే, మన వాళ్ళలో పదీ పన్నెండు మందిని, గూబమాను పక్కనవున్న పల్లెకు పంపి, అక్కడ మనవాళ్ళకూ, ఆ పల్లెలోని దుర్మార్గులకూ జరుగుతున్న పోరు ఏమయిందో తెలుసుకు రావాలి," అన్నాడు గడేజంగ్.

తమ నాయకుడి ఆజ్ఞకాగానే యువకుల్లో ఒకడు చెట్ల వెనక్కు పరిగెత్తాడు. రెండవవాడు కేశవుణ్ణీ, జయమల్లునూ, ముసలివాణ్ణీ వెంట బెట్టుకుని, దాపులనే

"అర్ధరాజ్యానికి ఆశ పడి, ఈ కోయ వాడు మోసానికి పూనుకుంటే, ఏం చేసేట్టు?" అన్నాడు ముసలివాడు.

కేశవుడు తన ఒరలో వున్న కత్తి కేసి వేలు చూపాడు. జయమల్లు అంబుల పొది లోంచి ఒక బాణం లాగి, తిరిగి దాన్ని యథాస్థానంలో పెట్టాడు. తన కొడుకూ, అతడి మిత్రుడూ కనబరిచిన ధైర్యానికి, ముసలివాడు ఎంతో సంతోషించాడు. ఈ పండు వయసులో తను ఏ క్షణాన ఏ చెట్టు కిందో రాలిపోయినా, తన కొడుకు ఈ లోకంలో అన్ని కష్టాలనూ సాహసంతో ఎదుర్కొనగలడన్న నమ్మకం అతడికి కలిగింది.

వున్న కొండ గుహల కేసి బయలుదేరాడు. కేశవుడూ, అతడి అనుచరులూ, చెట్టు చేమలతో దట్టంగా కప్పబడిన ఒక కొండ గుహలో చేరి, కోయయువకు డిచ్చిన, పళ్ళూ ఫలాలూ, కాల్చిన లేడి మాంసమూ తృప్తిగా తింటూండగా, అక్కడ గూబమాను పల్లె చేరిన బ్రహ్మదండి మాంత్రికుడు, ఆకలితో, అవమానంతో కడుపు భగ్గుమంటూండగా, పల్లెవాసుల్ని నోటికి వచ్చినట్లల్లా దుర్భాష లాడుతున్నాడు.

"రాజద్రోహులకు పల్లెలో ఆశ్రయం యివ్వటమేగాక, రాజదూతలను చంపేందుకు వాళ్ళను అరణ్యా దారి మార్గంలో కాపలాపెడతారా? ఈ మహాపరాధానికి పల్లెలోని పిన్నా, పెద్దా; ఆడా, మగా అందర్నీ—కణాలమీద భస్మం చేయగలను! ఆం హుం ఫట్ ఘట్... కాలభైరవా..." అంటూ బ్రహ్మదండి మంత్రం జపించేంతలో, కేకలు పెడుతూ కొందరు అరణ్యం వైపునుంచి, పల్లెలోకి రాసాగారు. వాళ్ళ చేతుల్లో వున్న కాగడాల వెలుగులో, ఆ వచ్చేవాళ్ళల్లో కొందరు కుంటుతూ వుండటం, మరికొందరు గాయపడిన తమ అనుచరుల్ని మోసుకురావటం కనిపించింది.

"రాజద్రోహు లెక్కడ?" అంటూ బ్రహ్మదండి కేకలు పెట్టాడు. అతడి అంగ





రక్షకులైన జితవర్మా, శక్తివర్మలూ, కొందరు పల్లెవాసులూ వాళ్ళకేసి పరిగెత్తారు. కాని, ఆ వస్తున్న వాళ్ళందరూ పల్లె యువకులే. వాళ్ళందరి ముఖాలమీదా భయభీతులు తాండవిస్తున్నవి. వాళ్ళల్లో దాదాపు గాయపడనివాడంటూ ఒకడూ లేడు.

"ఆ రాజద్రోహులు పారిపోయారా?" అని అడిగారు జితవర్మా, శక్తివర్మలు.

"ఉత్తినే పారిపోవటం కాదు, మా మీదికి కోయవిలుకాళ్ళను పంపకంచేసి మరీ పారిపోయారు. మా వాళ్ళల్లో కొందరు చచ్చారు కూడా. అర్ధ రాజ్యానికి వేయి దణ్ణాలు!" అన్నారు పల్లె యువకులు.



ఇంతలో బ్రహ్మదండి అక్కడికి వచ్చాడు. అతడికి మారువేషాల్లో వున్న కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ దొరక్కుండా పారిపోయారని అర్థమైంది. అతడికి కలిగిన కోపం అంతా యింతా కాదు. "మీ పల్లెవాసులంతా, ఇంత చచ్చువెధవలని నాకు తెలియదు. ఇంతమంది వుండి, ముగ్గురంటే ముగ్గురు రాజద్రోహుల్ని ప్రాణాలతో పారిపోనిస్తారా! సరే, జితా, శక్తీ! మీరు వెంటనే వెళ్ళి మహారాజులుంగారితో, మహారాజగురుశ్రేష్ఠులతో యిక్కడ జరిగిన భీభత్సం సంగతి చెప్పండి. ఆ రాజద్రోహుల్ని మట్టుపెట్టకపోతే, మనం వింధ్యారణ్యాలకు వెళ్ళేలోపలే హతం అయిపోతాం," అన్నాడు.

జితవర్మా, శక్తివర్మలు ముఖముఖాలు చూసుకున్నారు. ఇద్దరికీ ప్రాణభయం పట్టుకున్నది. బ్రహ్మపురనగరం చేరే లోపల, మహారణ్యంలో ఆ రాజద్రోహులు తమను దొరక పుచ్చుకుంటే ఏమికాను? వాళ్ళ మనసుల్లోని భావాలు గ్రహించినవాడిలా బ్రహ్మదండి పెద్దగా హుంకరించి, "మీరా నాకు అంగరక్షకులు! మిమ్మల్ని నమ్ముకుని వింధ్యారణ్యాలకు పోవటం అంటే, కోరి ప్రాణగొడ్డం తెచ్చుకున్నట్టే!" అన్నాడు.



"అది కాదు, బ్రహ్మదండీ! ఈ రాత్రికి రాత్రే వెళ్ళి రాజగురువుతో, యీ సంగతి చెప్పటం అంత అవసరమంటావా?" అన్నాడు జితవర్మ.

"అవసరమా! ఎందుక్కాదు? ఆ ద్రోహుల్ని విచ్చలవిడిగా సంచరించనిస్తే, మనం వింధ్యారణ్యాలకు ఎలా చేరగలం? వాళ్ళు మన గుర్రాలను కూడా అపహరించారు గదా! రాజగురు శిరోమణికి అంతా తెలిస్తే, ఆయన సైనికులను పంపి, వాళ్ళను వేటాడించగలడు గదా? అదెంత త్వరగా జరిగితే, మనకంత క్షేమం గదా?" అన్నాడు బ్రహ్మదండి.

జితవర్మా, శక్తివర్మలు పల్లెవాసుల్లో పది మందిని ధనాశ చూపి, తమకు తోడుగా వెంట బెట్టుకుని, బ్రహ్మపురం కేసి బయలు దేరారు. వాళ్ళు అలా కొంచెం దూరం వెళ్ళారో లెదో, మాంత్రికుడు పరిగెత్తి జితవర్మ భుజం పట్టుకుని దూరంగా లాక్కుపోయి, "జితా! నువ్వూ, శక్తీ కూడా వెళితే, ఈ పల్లెలో నేను ఒంటరిగాణ్ణయిపోతాను. ఈ దుర్మార్గుల్లో ఎవడో ఒకడు నా గొంతుకోస్తే, నా గతేంకాను? నువ్వుయిక్కడేవుండు. శక్తి నగరానికివెళతాడు," అన్నాడు. జిత శక్తివర్మలు కూడ బలుక్కున్నారు. జితవర్మ, బ్రహ్మదండితో పాటు



నుంచి బయటికి వచ్చి కేశవుడూ, జయమల్లూ, ముసలివాడూ—గుహ ముందున్న చెట్ల కింద కూర్చున్నారు. వాళ్ళ కెదురుగా పులిచర్మాలు పరిచిన ఒక ఎత్తయిన పీఠం మీద గడేజంగ్ కూర్చుని వున్నాడు. కేశవుడూ వాళ్ళు తమ ప్రయాణాన్ని గురించి గడేజంగ్‌తో మాట్లాడుతున్నారు.

హఠాత్తుగా ఇద్దరు కోయయువకులు చెట్ల చాటునుంచి బాణాల్లా దూసుకువచ్చి, తమ నాయకుడి ముందు రొప్పుతూ నిలబడ్డారు. గడేజంగ్, ఆశ్చర్యంగా వాళ్ళ కేసి చూస్తూ, "ఏం జరిగింది?" అని అదుర్దాగా వాళ్ళను ప్రశ్నించాడు.

ఆ యువకులు కేశవుడూ, జయమల్లుల కేసి ఓ తృటికాలం అనుమానంగా చూసి, "జంగ్ దొరా! చాలా ముఖ్యమైన రహస్యం. ఇప్పుడే తెలిసింది. మీరు కాస్త అవతలికి రండి, చెపుతాం," అన్నారు.

గడేజంగ్ పీఠం మీది నుంచి లేచి వాళ్ళ వెంట కాస్త దూరం నడిచి ఆగాడు. యువకుల్లో ఒకడు చిన్నగొంతుతో తమ నాయకుడికి ఏవో చెప్పసాగాడు. గడేజంగ్ కొద్దిసేపు విని, తలపక్కకు తిప్పి, కేశవుడూ అతడి అనుచరుల కేసి ఆశ్చర్యంగా చూసి, తల పంకిస్తూ వాళ్ళ కేసి రాసాగాడు.



తమ కేదో అనుకోని ప్రమాదం రానున్నదని కేశవుడు భావించాడు. జయమల్లూ, ముసలివాడూ ఒకేసారి ఒరలోవున్న తమ కత్తుల మీదికి చేతులు పోనిచ్చారు. ఇదంతా గమనిస్తున్న గడేజంగ్ చిరునవ్వు నవ్వుతూ వాళ్ళను సమీపించి, "మీ ధైర్యసాహసాలు చెప్పుకోదగినవి. కాని, మీ రహస్యం బయటపడిపోయింది. బ్రహ్మపుర సైనికులు మీ కోసం అరణ్యం అంతా గాలిస్తున్నారు. సరిహద్దు కాపలావాళ్ళకు కూడా హెచ్చరిక వెళ్ళింది. మీరు క్షత్రియులూ కాదు, మామూలు ప్రయాణీకులూ కాదు. రాజుతో వైరం తెచ్చుకున్నవాళ్ళు!" అన్నాడు.

"అర్ధరాజ్యానికి ఆశించి, నీ రక్షణ కోరిన వాళ్ళను, సైనికులకు అప్పగించబోతున్నావా, గడేజంగ్?" అన్నాడు కేశవుడు.

గడేజంగ్ పొట్టచెక్కలయేలా నవ్వుతూ, పీఠం మీది నుంచి వెల్లకిలా కిందబడి, లేచి, "అర్ధరాజ్యం కాదు, మొత్తం బ్రహ్మపుర రాజ్యం యిచ్చినా నేను తీసుకోను. నాకెందుకు రాజ్యం? ఈ మహారణ్యమే నా రాజ్యం. నా కులపువాళ్ళూ, యిక్కడ తిరిగే సాధు, క్రూరమృగాలూ నా పౌరులు. మీరు వెంటనే కోయవేషాలు వేసుకోండి. నా అనుచరులు మిమ్మల్ని సరిహద్దు దాటిస్తారు," అన్నాడు.

ఆ మాటలతో కేశవుడికీ, జయమల్లుకూ, ముసలివాడికీ కలిగిన ఆనందం అంతా యింతా కాదు. వాళ్ళు గడేజంగ్‌కు ఒకటికి రెండుసార్లు తమ కృతజ్ఞత తెలియపరిచారు. గడేజంగ్ అనుచరులు తెచ్చి యిచ్చిన లేడి చర్మాలు కట్టుకుని, తలల్లో పక్షి ఈకలు ధరించి, తమ దుస్తుల్ని మూటలుగా కట్టి భుజాల మీద వేసుకుని ప్రయాణసన్నాహమయారు.

గడేజంగ్, కోయయువకు లిద్దర్ని పిలిచి వాళ్ళతో, "ముందు ఆ మూడు గుర్రాలనూ అరణ్యంలోకి తరిమెయ్యండి. తరవాత నా మిత్రులు యీ ముగ్గుర్నీ అడ్డదారి వెంట తీసుకుపోయి, రాజ్య సరిహద్దులు దాటించండి. ఆ ప్రయత్నంలో సరిహద్దు కాపలావాళ్ళతో పోరు తప్పకపోతే, ముందు ప్రాణాలర్పించవలసిన వాళ్ళు, మీ యిద్దరు!" అన్నాడు.

క్షణాలమీద గుర్రాలు మూడూ అరణ్యం లోపలికి తరమబడినై. కోయయువకుల్లో ఒకడు ముందూ, ఒకడు వెనకా నడవగా, కోయల్లా వేషాలు మార్చుకున్న కేశవుడూ, ముసలివాడూ, జయమల్లూ, బ్రహ్మపుర రాజ్య సరిహద్దుల్ని దాటి పోయేందుకు బయలుదేరారు. —(ఇంకా వుంది)






# నిలబెట్టిన కాపరం

రాజుగారిచ్చిన వెయ్యి వరహాల సంచీ రొండిన కట్టుకుని పాపన్న తన గ్రామానికి బయలుదేరాడు. అతను ఒక కొండ పక్కగా పోతూ ఒక మలుపు తిరిగే సరికి, చెట్టుకు ఉరిపోసుకు చావటానికి ప్రయత్నం చేస్తున్న ఒక యువకుడు అతనికి కనిపించాడు. చూడటానికి వాడు పెళ్ళికొడుకు లాగా, కొత్త బట్టలు కట్టుకుని ఉన్నాడు కూడా. పాపన్న అతని చేతిలో ఉన్న ఉచ్చు లాగేసుకుని, చెట్టు కొమ్మకు కట్టి ఉన్న తాటిని ఒక్క గుంజు గుంజి తెంచి, "నీ కేం కష్టం వచ్చింది? ఎందుకు చావాలను కుంటున్నావు? నా వల్ల ఏమైనా సహాయం కావాలంటే చెప్పు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని ఆ యువకుడు, "నన్నెందుకు చావనిచ్చావు కావు? నేను బతికి ఉంటే అన్నీ కష్టాలే. కనీసం నూరు వరహాలైనా లేందీ నా మానం దక్కదు. నా కిప్పుడు నూరు వరహాలు ఎవరిస్తారు? లోకంలో అటువంటి దాతలే ఉంటే నేను ఆత్మహత్య చేసుకునే పరిస్థితి రాకనే పోను!" అంటూ ఏడవ నారంభించాడు.

పాపన్న వాణ్ణి ఓదార్చి, "ఏడవకు, నీకు కావలిసిన నూరు పరహాలూ నే నిస్తాను. వాటితో నీ కష్టాలు గట్టెక్కే పక్షంలో సుఖంగా బతుకు," అంటూ రొండి నున్న సంచీ విప్పి, నూరు వరహాలు ఎంచి ఆ యువకుడి చేతిలో పోశాడు.

ఆ యువకుడు వాటిని అందుకుంటూనే ఎటో పారిపోయాడు. వాడి ప్రవర్తన చూసి పాపన్నకు ఆశ్చర్యం కలిగింది. తాను బుద్ధి పూర్వకంగా ఇచ్చిన సొమ్మేగదా, దొంగ తనం చేసిన వాడిలాగా ఎందు కలా పారి పోవాలీ? ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. పాపన్న చుట్టూ కలయ జూడగా ఒక చిన్న మూట కని

పరోపకారి పాపన్న కథలు—3




పించింది. ఆ మూట ఆ యువకుడిదే అయి ఉండాలి. ఎందుకంటే, ఆ యువకుడు ధరించిన కొత్త బట్టలలాటివే మరొక జత ఆ మూటలో పాపన్నకు కనపడింది. అతను తన కుళ్ళు గుడ్డలను విప్పేసి ఆ కొత్త బట్టలు కట్టుకుని తన దారిన బయలుదేరాడు.

పాపన్న కాపాడిన యువకుడు ఒక అభాగ్యుడు. వాడి పేరు శ్యామన్న. వాడికి తండ్రి లేడు. చిన్నతనం నుంచీ చెడు సహవాసాలు చేసి, తల్లి మాట వినక డబ్బంతా తగలేసి, చివరకు అప్పులపాలయాడు. బాకీదార్లు తొందర పెట్టసాగారు.

శ్యామన్నకు అయిదేళ్ళ క్రితం పెళ్ళి అయింది. భార్య ఈడేరినా కూడా వాడామెను కాపరానికి తెచ్చుకోలేదు.

ఆమెను తీసుకు పొమ్మని మామగారు తొందర పెట్టసాగాడు.

ఒక వంక బాకీదార్లు ఇల్లు స్వాధీనం చేసుకుని తల్లినీ తననూ ఇంటి నుంచి గెంటే లాగున్నారు. మరొక వంక భార్యను తీసుకుపొమ్మని మామగారు ఒత్తిడి చేస్తున్నాడు. ఈ పరిస్థితిలో ఏమి చెయ్యాలో శ్యామన్న తేల్చుకోలేక పోయాడు. వాడి అప్పుల మాట తల్లికి తెలియదు. అందుచేత అమె వాణ్ణి పోరి అత్తవారింటికి పంపింది.

అత్తవారు సంతోషించి వాడికి కొత్తబట్టలు పెట్టి మర్యాదలన్నీ చేసి రెండు రోజులుండమని బతిమాలారు. కాని వాడు వాళ్ళ మాట వినక తన భార్యతోసహా వచ్చిన రోజు సాయంకాలమే ఇంటికి బయలుదేరాడు. త్వరలోనే చీకటి పడింది. భార్యా భర్తలు ఆ రాత్రి ఏ చెట్టు కిందనో పడుకున్నారు. భార్యకు కాస్త కునుకు పట్టగానే శ్యామన్న లేచి తప్పుడు దారిన బయలుదేరి పర్వతం సమీపానికి వచ్చాడు. తాను ప్రాణం తీసుకోవటం తప్ప మరే మార్గమూ లేదనిపించింది. వాడా పని చేసే ప్రయత్నంలో

ఉండగా, దేవుడల్లే పాపన్న వచ్చాడు. అతడికి బాకీలు తీర్చటానికి సరిపడే సొమ్ము కూడా ఇచ్చాడు.

శ్యామన్న మొదటి ఆలోచన ఆ నూరు వరహాలూ పాపన్న మళ్లీ తీసేసు కుంటాడనే. ఆ భయంతోనే వాడు తన మూట కూడా మరిచి పారిపోయాడు. కాని కొంత దూరం వెళ్ళాక వాడికి మరొక ఆలోచన వచ్చింది. ఈ నూరు వరహాలతో ఇల్లు మాత్రమే దక్కుతుంది. అయితే పాపన్న సంచీలో ఇంకా ఎన్నో వరహాలున్నాయి. అవికూడా సంపాదించ గలిగితే తాను నిశ్చింతగా కొంత కాలంపాటు ఒక వెలుగు వెలగవచ్చు.

శ్యామన్న పాపన్నను దొంగ దెబ్బ కొట్టి అతని వద్ద ఉన్న సంచీ కాజెయ్య నిశ్చయించుకుని, ఒక పెద్ద రాయి తీసుకుని పాపన్న వచ్చే దారిలో మాటు వేసి కూచున్నాడు. కొంతసేపు గడిచాక పాపన్న అటుగా వచ్చాడు. అతణ్ణి దాటి పోనిచ్చి వెనక పాటున శ్యామన్న పాపన్న తల మీద రాయితో బలంగా కొట్టాడు. పాపన్న స్పృహ తప్పి పడిపోయాడు. శ్యామన్న అతని రొండిన ఉన్న సంచీ తీసుకుని దూరంగా వెళ్ళి, ఒక రహస్య ప్రదేశంలో సంచీ విప్పి వరహాలు ఎంచుకున్నాడు.



అంత డబ్బు చేతికి రాగానే శ్యామన్న మనస్థితి పూర్తిగా మారిపోయింది. ప్రాణం మీద మమత తిరిగి వచ్చింది, భార్య మీద ఎక్కడలేని అభిమానమూ పుట్టు కొచ్చింది. తాను అదివరకు గడిపిన జీవితం మీద రోతకూడా పుట్టింది. ఇక నుంచి సన్మార్గంలో బతకాలని నిశ్చయించుకున్నాడు.

తన భార్య ఏమై ఉంటుందా అనుకుని శ్యామన్న, పుట్టింటికే తిరిగి వెళుతుందని నిశ్చయించుకున్నాడు. తన దగ్గిర ఇప్పుడు పుష్కలంగా డబ్బు ఉన్నది గనక, పట్నం వెళ్ళి భార్యకు నగలూ, చీరెలూ కొనుక్కొని, అత్తవారింటికి వెళ్ళి, అక్కడ కొన్ని రోజులు

సరదాగా గడిపి తరవాత తన గ్రామం వెళ్ళ టానికి నిశ్చయించుకున్నాడు.

తెల్లవారినాక శ్యామన్న నగరం చేరు కున్నాడు. నగల వర్తకుడి దుకాణంలోకి వెళ్ళి నగలు బేరం చెయ్యసాగాడు. అయితే శ్యామన్న చేతిలో ఉన్న సంచీపై రాజ ముద్ర లుండటం గమనించి నగల వర్తకుడు రహస్యంగా తన మనిషి ద్వారా రాజుగారికి కబురు పంపి, నగలు చూపించే మిష మీద కబుర్లు చెబుతూ శ్యామన్నను చాలాసేపు దుకాణంలో కూర్చోబెట్టాడు.

చివరకు రాజభటులు వచ్చి, శ్యామన్నను పట్టుకుని రాజుగారి ఎదట పెట్టారు. సంచీని రాజుగారు గుర్తించాడు. అందులో ఉన్న సొమ్ము ఎంచితే లెక్క ప్రకారం వెయ్యి వరహాలూ ఉన్నాయి. ఒక్క వరహా ఖర్చు చెయ్యటానికి కూడా శ్యామన్నకు అవకాశం దొరక్క పోయింది.

"నీ కీ సంచి ఎలా వచ్చింది?" అని రాజుగారు అడిగితే శ్యామన్న, ఎవరో దాత ఇచ్చాడని చెప్పాడు. ఎందు కిచ్చాడంటే చెప్పలేకపోయాడు.

"మీదే గ్రామం?" అని అడిగితే శ్యామన్న తన గ్రామం పేరు చెప్పక మరొక గ్రామం పేరు చెప్పాడు. ఆ గ్రామంలో వారిని గురించి ఏమీ చెప్పలేక పోయాడు,



రాజుగారు అనుమానం మీద శ్యామన్నను ఖైదు చేయించి, పాపన్న క్షేమంగా ఇల్లు చేరినదీ లేనిదీ తెలుసుకురమ్మని భటులను పాపన్న ఇంటికి పంపాడు.

ఈ లోపల అక్కడ శ్యామన్న భార్య పద్మ, తన భర్త లేచి వెళ్ళిపోయిన కొద్ది సేపటికే నిద్రలేచింది. తన భర్త తనను ఒంటరిగా వదిలి ఎటో వెళ్ళిపోయాడని నిశ్చయించుకున్నాక ఆమె శ్యామన్న ఊహించినట్టు పుట్టింటికి పోలేదు. అత్త వారింటికి వెళ్ళిపోవాలని ఆమె చాలా కాలంగా తహతహ లాడుతున్న మనిషి కావటం చేతనూ, పుట్టింటికి తిరిగివెళితే అందరూ "నీ భర్త ఏమయాడు?" అని అడుగుతారన్న లజ్జతోనూ పద్మ ముందుకే సాగింది. ఎవరినన్నా అడిగి దారి తెలుసుకుంటూ అత్తవారి ఊరు వెళ్ళిపోవాలని ఆమె ఉద్దేశం.

చాలా సేపు నడిచి ఆమె పాపన్న పడి ఉన్న చోటికి వచ్చింది. అతను ధరించిన బట్టలు తన భర్తకు తన వాళ్ళు పెట్టినవే కావటం చేత ఆ పడి ఉన్నది తన భర్తే అనుకున్నది. అదీగాక ఆమె ఇంతవరకు భర్త ముఖం ఎలా ఉంటుందో సరిగా ఎరగదు. తన భర్తను ఎవరో కొట్టారని అదుర్దా పడుతూ ఆమె పాపన్నకు శైత్యోపచారాలు





చేసింది. పాపన్న త్వరలోనే తేరి కూచున్నాడు. తల వెనక భాగం తడివి చూసుకుంటే బొప్పి కట్టి ఉన్నది. అసలే దృఢమైన మనిషి కనక దాన్ని అతను లక్ష్య పెట్టలేదు. అతను పద్మను చూసి, "ఎవరో ఈ మనిషి?" అనుకున్నాడు. అతనికి స్పృహ రాగానే పద్మ దూరంగా వెళ్ళి తల వంచుకుని నిలబడటం చేత ఆమె తనకు శైత్యోపచారాలు చేసిన సంగతి కూడా పాపన్న ఎరగడు. అతను తన సంచీ కోసం తడువుకుని, "నన్ను కొట్టి దొంగ లెవరో నా సంచీ ఎత్తుకుపోయారు," అన్నాడు. పద్మ మాట్లాడలేదు.

పాపన్న జరిగినదానికి చింతించే రకం కాదు. అతను లేచి బట్టలు దులుపుకుని తన దారిన తాను స్వగ్రామం కేసి బయలుదేరాడు. పద్మ అతనికి కొంచెం వెనకగా మౌనంగా నడవసాగింది.

ఈ సంగతి గమనించి పాపన్న వెనక్కు తిరిగి, "ఏమమ్మా, ఎవరు నీవు? నీకు తోడెవరూ లేరా? ఎక్కడికి పోతున్నావు? అవసరమైతే నేను నిన్ను నీవు పోవలిసిన చోట వదిలి నా దారిన నేను పోతాను. పరోపకారం చెయ్యమని మా గురువుగారు నాకు బోధించారు," అన్నాడు.

అతని మాటలు విని పద్మ, దొంగలు కొట్టిన దెబ్బతో తన భర్తకు మతి చెడిందనుకుని, "మీరు తప్ప నా కెవరున్నారు? నే నెక్కడికి పోగలను? మీ రెక్కడికి పోతే నేను అక్కడికి పోవలిసిన దాన్నే!" అన్నది.

ఈ మాటల అంతరార్థం పాపన్నకు తెలియలేదు. అయినా అతను నిస్సంకోచంగా, "అయితే, నేను మా ఇంటికే పోతున్నాను. నా వెంట వచ్చెయ్యి. మా అమ్మ నీ సంగతి అంతా చక్కగా విచారిస్తుంది," అన్నాడు.

ఈ మాటలు విని పద్మ ఎంతో సంబరపడింది. ఇద్దరూ పాపన్న ఇంటికి చేరు

కున్నారు. పాపన్న కోసం అతని తల్లి ఎంతో అదుర్దాగా వేచి వున్నది. ఆమె పాపన్నను చాటుకు పిలుచుకుపోయి ముందుగా పద్మ విషయం అడిగింది.

"ఈమె ఎవరో నాకు తెలియదమ్మా. దారిలో కలిసింది. ఒంటరిది లాగుంది. నా వెంట పడి వచ్చింది. దిక్కులేని మనిషి కాబోలని వెంట తెచ్చాను. నేను ఏదన్నా అడిగితే సరిగా చెప్పటానికి సిగ్గు పడి తల వంచుకుంటున్నది. నీవే ఆమె విషయం విచారించు, చేతనైన సహాయం చేద్దాం," అన్నాడు పాపన్న.




తరవాత అతను తల్లికి తన చదువు గురించీ, రాజకుమారుణ్ణి రక్షించటం గురించీ, రాజుగారు చేసిన సన్మానం గురించీ, ఇంటికి వస్తుండగా ఆత్మహత్యా ప్రయత్నంలో ఉండిన యువకుణ్ణి గురించీ, తరవాత తనను దారిలో దొంగలు కొట్టి వరహాల సంచీ కాజేయటం గురించీ సవిస్తరంగా చెప్పాడు.

ఇదంతా పక్కన ఉండి వింటున్న పద్మకు రెండు విషయాలు స్పష్టంగా తెలిసిపోయాయి: ఈ పాపన్న తన భర్తకాడు; తన భర్త తనను ఒంటరిగా విడిచిపోయినాక ఆత్మహత్య చేసుకోపోయి, పాపన్న చేత రక్షించబడి, అతని వద్ద నూరు వరహాలు కూడా పుచ్చుకున్నాడు. ఆ తరవాత తన భర్త ఏమయాడో ఆమె ఏమాత్రం ఊహించ లేక పోయింది.

ఇంతలోనే రాజభటులు వచ్చి చేరారు. ఒక యువకుడు వెయ్యి వరహాలూ, రాజ ముద్రలూ గల సంచీతో పట్టుబడ్డాడని వారు పాపన్నతో చెప్పారు. పాపన్న తన సంచీ పోయిన సంగతి వారితో చెప్పి, "అందులో తొమ్మిది వందల వరహాలే ఉండాలి. రాజుగారు నా కిచ్చిన వెయ్యిలో ఒక వంద వరహాలు ఒక అభాగ్యుడికి ఇచ్చాను," అన్నాడు. అతని సంచీ నుంచి తీసి తాను

కట్టుకున్న కొత్త బట్టలుకూడా రాజ భటులకు చూపాడు.

దొరికిన దొంగ అలాటి బట్టలే కట్టుకుని ఉన్నాడని రాజభటులు చెప్పారు. తన సంచీ కాజేసినవాడు తన చేత రక్షించబడిన వాడేనని పాపన్నకు తెలిసిపోయింది. దొంగ తన భర్తేనని పద్మకుకూడా తెలిసిపోయింది. ఆమె ఏడుస్తూ పాపన్న కాళ్ళ పై పడి, "బాబూ, నా భర్తకు శిక్ష పడకుండా చూడండి. నా కాపరం నిల బెట్టండి," అని బతిమాలింది.

పాపన్న పద్మను దుఃఖించ వద్దని చెప్పి రాజభటుల వెంట రాజుగారి వద్దకు వెళ్లాడు. చెరలో ఉన్న శ్యామన్నను గుర్తు పట్టాడు. శ్యామన్న తాను చేసిన ద్రోహం ఒప్పుకుని, తన పేదరికం ఎలాటిదో వివరించి, బావురుమని ఏడిచాడు.

శ్యామన్న కోసం కాకపోయినా, ఏ పాపమూ ఎరగని పద్మ సౌఖ్యం కోరి పాపన్న రాజకుమారుడితో, "శ్యామన్నను శిక్షించకండి. కావలిస్తే వాడి శిక్ష నేను అనుభవిస్తాను. ఆ పిల్ల చాలా మంచిది. కొత్తగా కాపరానికి వస్తున్నది. భర్తతో సుఖపడాలని ఎంతగానో కలలు కన్నది. నా వెయ్యి వరహాలూ వాళ్ళకే ఇవ్వ నిశ్చయించాను. ఒకరికి కష్టం కలిగించటం తేలిక, సుఖం కలిగించటం గొప్ప విషయం!" అన్నాడు.

పాపన్న చెప్పిన మాటల ఫలితంగా రాజకుమారుడు శ్యామన్నను శిక్షించకుండా వదిలి పెట్టటమేగాక అతను భార్యతో సుఖంగా కాపరం చెయ్యటానికి తగినంత ధనంకూడా ఇచ్చాడు.

పాపన్న శ్యామన్నను తన ఇంటికి తీసుకుపోయి అతనికి పద్మను వప్పగించి, "ఇది వరకు ఏం చేశావో చేశావు, ఇకనైనా బుద్ధిగా బతుకు. నీ భార్య రత్నం లాటిది," అని హితవు చెప్పి పంపేశాడు.

[వచ్చే సంచికలో మరో సంఘటన]



# ఏది మంచి? ఏది చెడ్డ?

చీనాలో ఒక ముసలివాడుండే వాడు. వాడి కొక గుర్రం ఉండేది. ఒకనాడా గుర్రం ఎటో వెళ్ళిపోయింది. చుట్టుపక్కలవాళ్ళు వచ్చి, గుర్రం పోయినందుకు ముసలి వాణ్ణి పరామర్శించారు.

అంతా విని ముసలివాడు, "ఏమో, ఇదీ ఒకందుకు మేలే కావచ్చు," అన్నాడు. వాడన్నట్టుగానే ఆ పోయిన గుర్రం తిరిగి వస్తూ మరొక కొత్త గుర్రాన్ని వెంట పెట్టుకుని మరీ వచ్చింది.

ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి ముసలివాణ్ణి అభినందించారు. కాని ముసలి వాడు, "ఏమో, ఇందువల్ల నష్టమే కలగవచ్చు," అన్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజుల అనంతరం ముసలివాడి కొడుకు కొత్త గుర్రం ఎక్కి స్వారిచేస్తూ, పడి కాలు విరగగొట్టుకున్నాడు.

మళ్ళీ ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి ముసలివాడికి సానుభూతి తెలిపారు. ముసలివాడు అంతా విని, "ఏమో, ఇదీ ఒకందుకు మేలే కావచ్చు," అన్నాడు.

సరిగా ఆ సమయంలోనే హూణులతో యుద్ధం వచ్చింది. చెయ్యీ కాలూ సరిగా ఉన్నవారి నందరినీ సైన్యంలో చేర్చారు. అందరూ యుద్ధంలో చచ్చారు. కాలు విరిగిన ముసలివాడి కొడుకు మాత్రం తప్పించుకున్నాడు.






తాతయ్య ఇంటికి వచ్చేసరికి పిల్లలందరూ బుల్లివాణ్ణి నవ్వులు పట్టిస్తున్నారు.

"ఎందుకర్రా, అందరూ కలిసి వాణ్ణి ఏడిపిస్తున్నారూ? రా, నాన్నా! ఏం జరిగిందో తాతకి చెప్పు," అన్నాడు తాతయ్య.

బుల్లివాడు తాతను ఆశ్రయించి, తనకు కలిగిన కష్టమేమిటో చెప్పుకోకపోగా, "నేను రాను ఫో! నీకు చెప్పను ఫో!" అన్నాడు తాతయ్యతో.

అప్పుడు తాతయ్య మిగిలినవాళ్ళను, "అసలు సంగతేమిట్రా?" అని అడిగాడు.

అందరూ కలిసి దాగుడుమూత లాడుతుంటే బుల్లివాడు తానుకూడా ఆడాలని పట్టుపట్టాడట. "నీకు చాతకాదురా," అంటే వాడు వినలేదు. సరేనని పెద్ద పిల్లలు వాణ్ణి కూడా ఆటలోకి రానిచ్చారు. వాడు దాక్కునేటందుకు చోటు వెతుకుతూ అటూ ఇటూ పరిగెత్తుతూ, "దొంగ" తో "అప్పుడే రావద్దు!" అని చెబుతూ వచ్చాడు. చివరకు బుల్లివాడు ఒక గంప చాటున దాక్కుని, "ఇక రావచ్చు!" అని గట్టిగా కేక పెట్టాడు. దాంతో దొంగకి బుల్లివాడు దాక్కున్న చోటు కాస్తా తెలిసిపోయింది. అందుకని అందరూ బుల్లివాణ్ణి చూసి నవ్వుకుంటున్నారు.

"ఇంతేగదా?" అంటూ తాతయ్య కుర్చీలో కూచుని, బుల్లివాణ్ణి ఒళ్ళో కూచోబెట్టుకుని, "ఒరే, నీవంటిదే ఒక సముద్రపు జంతు వుందిరా. దానికి కాళ్ళూ, మీసాలూ, తలా ఉంటాయిట. బెస్తవాళ్లు వచ్చినప్పుడు అది అచ్చు నీలాగే దాక్కుంటుందిట్రా! తన కాళ్ళను తలలోకి లాక్కుని, తలను పొట్టలో దూర్చుకుంటుందిట. అంతటితో ఊరుకుంటుందా? తాను ఎక్కడ ఉన్నదీ బెస్తవాళ్ళకు తెలియకుండా ఉండగలందులకు ఒక నల్లని సిరాలాటి ద్రవం వదులు

తుందిట. ఇంకేముందీ? సముద్రంలో ఆ నల్లటి మరక ఉన్న చోట చూసి జెస్త వాళ్ళు వల వేసి ఆ జంతువును కాస్తా పట్టే స్తారుట," అన్నాడు.

"వాటికి మెదడు ఉండదు, తాతయ్యా. మనిషి మెదడుతో పోలిస్తే జంతువుల మెదడు చిన్నది; అంత మంచిదికూడా కాదు: మా క్లాసు పుస్తకంలో ఉంది. లకుముకిపిట్ట ఏం చేస్తుందో తెలుసా, తాతయ్యా?" అన్నాడు పెద్ద పిల్లవాడు.

"నాకు తెలీదురా! ఏం చేస్తుందిటా?" అన్నాడు తాతయ్య.

"ఎవరికీ అందకుండా ఉండాలని ఎంతో ఎత్తయిన చెట్టు చూసుకుని చివారు కొమ్మన గూడు కడుతుందిట. తీరా పిల్లలు పాదిగాక, అంత ఎత్తు నుంచి పడిపోతే పిల్లలకు అపాయమని కొంచెం కింది కొమ్మ మీదకు గూడు మారుస్తుందిట. పిల్లలు పెద్ద వవుతున్న కొద్దీ దానికి బెదురు జాస్తి అయి, గూటిని నేలకు దగ్గిరిగా తెచ్చి, ఆ పిల్లలు దారే పోయేవాళ్ళకి సులువుగా అందేటట్టు చేస్తుందిట!" అన్నాడు పెద్దవాడు.

తాతయ్య బుల్లివాణ్ణి ఒళ్ళోనుంచి దింపి, రొండి నుంచి పొడుంకాయ తీస్తూ, "పిచ్చి వాళ్ళలారా, మనుషులు కూడా అటు



వంటి అర్థంలేని పనులు చేస్తూనే ఉంటారు — జంతువులూ, పక్షులూ చెయ్యటం వింతా ఏమిటి?" అన్నాడు.

"మనుషులు కూడా అంత బుద్ధి తక్కువగా ఉంటారా, తాతయ్యా?" అని పిల్లలు అడిగారు.

"నింపాదిగా అడుగుతున్నారా? జంతువులూ, పక్షులూ బుద్ధిలేక బుద్ధి తక్కువగా ఉంటాయి. మనుషులు బుద్ధి ఉండి కూడా బుద్ధి తక్కువ పనులు చేస్తారు, బుద్ధి తక్కువ మాటలు మాట్లాడతారు గద! వెనకటి కొకడు రహదారి ప్రయాణీకుల కోసం దారి పక్కనే బావి తవ్వించా

డటు. ఆ చుట్టుపక్కల ఎక్కడా కోసు దూరంలో నీరు లేకపోవటం చేత అందరూ వాణ్ణి మెచ్చుకుని, ఆ బావి తవ్వవలిసిన చోట తవ్వాడు అని ఆకాశాని కెత్తేశారు. అయిందా? కొంతకాలం గడిచాక చీకట్లో ప్రయాణం చేస్తూ ఎవడో బావి గమనించక అందులో పడి చచ్చాడు. ఇంకేముందీ? ఆ బావి తవ్వించిన వాణ్ణి అందరూ తిట్టిపోశారు. బావి తవ్వించటమే తప్పని కొందరూ, అక్కడ తవ్వించకుండా ఉంటే బాగుండేదని మరికొందరూ అన్నారు. లోకులు పలుగాకులు అన్న మాట అబద్ధమా?" అన్నాడు తాతయ్య.

"పదిమంది పది రకాలుగా మాట్లాడినంత మాత్రాన మనం మనుషులలో మూర్ఖులు హెచ్చుగా ఉంటా రనుకోవచ్చా, తాతయ్యా?" అన్నాడు పెద్ద కుర్రవాడు.

"కావాలని ఎవరూ మూఢులుగా ప్రవర్తించర్రా! మామూలు తెలివితేటలు గల వాళ్ళే ఒక్కొక్కసారి, ఒక్కొక్క సందర్భంలో, ఒక్కొక్క కారణం చేత బుద్ధి తక్కువగా ప్రవర్తిస్తారు. మీకు కొన్ని తార్కాణాలు చెబుతా.

"ఒక దేశంలో ఒక ప్రాంతంలో పులులు జాస్తిగా ఉన్నట్టు రాజుగారికి తెలిసింది. ఆ రాజుగారు ప్రచండుడు. జనం ఆయన



పేరు వింటే గజగజలాడే వాళ్ళన్నమాట. అవసరమైన చోటనల్లా ఆయన శాసనం వేయించేవాడు. జనం దాని ప్రకారం నడుచుకుంటూ ఉండేవాళ్ళు. ఆయన శాసనాలను రాళ్ళమీద చెక్కించి, ఆ రాళ్ళను పాతించేవాడు. వెంటనే ప్రజలు దాని ప్రకారం నడుచుకునేవాళ్ళు. ఇప్పుడు పులుల బాధ వచ్చిపడిందిగా, అందుకని పులులకు ఒక శాసనం చెక్కించాడు రాజుగారు. 'ఈ చుట్టు పక్కల అరణ్యాలలో ఉండే టటువంటి పులులన్నీ తక్షణం మరెక్కడికైనా వెళ్ళి పోవలిసింది,' అని రాతిపై చెక్కించి, ఆ రాతిని పులుల భయం జాస్తిగా ఉండే ప్రాంతంలో పాతించాడు. ఇంకేముంది, రాజుగారు శాసనం చెయ్యనే చేశారుగదా అని ప్రజలు ఆ ప్రాంతాలకు పోయి పులుల వాత పడి చచ్చి ఊరుకున్నారు. మరి రాజుగారు వేయించిన శాసనం బుద్ధి తక్కువ శాసనం కదూ? ఎందుకా పని చేశాడూ? తాను చండ శాసనుణ్ణి అన్న అహంకారం కొద్దీ! అంతకంటె ఇంకేమీలేదు.

"ఇంకో దేశంలో ఒక మంత్రిగారుండేవాడట. ఆయనకు ప్రజల మేలు గురించి చాలా ఆసక్తి ఉండేది. ప్రజల ఉపయోగానికి అనుకూలపడే సూచనలను చేసిన వారికి అయన గొప్ప బహుమానా లిచ్చి,





గౌరవిస్తూ ఉండేవాడు. ఆ మంత్రిగారి మెప్పు పొందాలన్న ఆదుర్దాతో ఒక ఉద్యోగి ఆయన వద్దకు వచ్చి, 'అయ్యా, మన ఊరికి తూర్పుగా ఉన్న పెద్ద చెరువు ఎండబెట్టిస్తే నిక్షేపంగా రెండు వేల ఎకరాలు సాగులోకి వస్తుందిగదా,' అన్నాడట. నిజమే గాని చెరువులో నీరంతా ఏంచేద్దామని మంత్రిగారు అడిగాడట. ఉద్యోగి కాస్సేపు ఆలోచించి, ఆ చెరువు పక్కనే అలాటి చెరువు మరొకటి తవ్వి నీటిని అందులోకి పంపకం చేద్దామన్నాడట!...చూశారా, వాడి వెర్రి ఆలోచనకు మీరు కూడా నవ్వుతున్నారు! కాని వాడు నిజంగా వెర్రివాడు కాడు; మంత్రిగారి మెప్పు సంపాదించాలన్న ఆదుర్దాయే వాణ్ణి వెర్రి వెధవని చేసింది. అంతకన్న మరేమీలేదు."

తాతయ్య ఆపటం చూసి పిల్లలు, "ఇంకా ఇటువంటి కథలు చెప్పు, తాతయ్యా!" అన్నారు.

"ఇటువంటి కథలకేమ్రా? నా తల వెంట్రుకలన్ని ఉన్నాయి. ఒక రాజుగారి కొలువులో ఒక ఉద్యోగి ఉండేవాడట. ఆ మానవుడికి, పాపం, అల్లం ఎక్కణ్ణుంచి వస్తుందో తెలీదు. ఒకనాడు మాటల సందర్భంలో ఆయన ఇంకొక ఉద్యోగిని అల్లపు చెట్లు ఎక్కడ జాస్తిగా ఉంటాయని అడిగాడట. రెండోవాడు అల్లం చెట్టున కాయదనీ, భూమిలోనే తయారవుతుందనీ చెప్పాడు. మొదటివాడు ఆ మాట నమ్మకపోగా అల్లం చెట్టునే కాస్తుందని నూరు రూపాయలు పందెం వేశాడు. పదిమంది పెద్దమనుషులను అడిగేటట్టూ, ఎక్కువమంది ఎవరి పక్షం చెబితే వారి పందెం నెగ్గేటట్టూ అనుకున్నారు. అలాగే పదిమందిని అడిగారు. పదిమందీ కూడా అల్లం నేలలోనే అవుతుందన్నారుగాని, ఒక్కడైనా చెట్టున కాస్తుందన్న పాపానపోలేదు. ఇకనేం? మొదటి ఉద్యోగి ఓడిపోయి, రెండోవాడికి నూరు

రూపాయలూ ఇచ్చేస్తూ, 'పందెం ఓడిపోతే నేంగాక, అల్లం చెట్టునకాసే మాటే నిజం. మీలో ఒక్కరికీ నిజం తెలీదు,' అన్నాట్ట. తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళంటారే ఆరకం మనిషి!

"ఇటువంటి వాళ్ళకు అనుభవం లేక తెలివితక్కువ మాటలు మాట్లాడతారు, తెలివితక్కువ పనులు చేస్తారు. వెనకటికి ఒక రాజుగారికి ఇద్దరు కొడుకులుండేవారట. ఒక రోజు వాళ్ళు వాదులాడుకున్నారు. బియ్యం ఎక్కడినుంచి వస్తుందీ అని ప్రశ్న. గోతాలలో నుంచి వస్తుందని ఒకడూ, పాతరలో నుంచి వస్తుందనీ రెండోవాడూ వాదించుకున్నారుట. అ ఇద్దరిలో ఏ ఒకడూ వరిపొలం చూసిన పాపాన పోయినవాడు కాకపోయె. వాళ్ళకేం తెలుస్తుందీ ?

"ఇలాగే ఇంకో కథ. ఒక చిత్రకారుడు ఒక బొమ్మ వేశాట్ట. అందులో రెండు ఎద్దులు పోట్లాడు కుంటున్నాయి. అవి కాళ్ళు తన్నిపెట్టి తలలు మోటించి, తోకలు పైకెత్తి పోట్లాడుకోవటం అమిత సహజంగా ఉందని అందరూ మెచ్చుకున్నారు. చిత్ర కారుడు గర్వంతో ఉక్కిరి బిక్కిరై పోయాడు. ఒక నాడు అ చిత్రకారుడి పశు వుల కాపరి పని మీద వచ్చి, గోడమీద ఎద్దుల చిత్రాన్ని చూసి వేళాకోళంగా నవ్వాడు.



చిత్రకారుడు వాడితో, "ఏంరా, నీకూ్కడా బొమ్మలు అర్థమవుతాయల్లే ఉందే. ఆ బొమ్మలో ఉండే ఎద్దులు నిజమైన ఎద్దులల్లేనే ఉన్నాయా?" అని అడిగాట్ట. దానికి పశువుల కాపరి, "ఉండటానికి ఎద్దులల్లేనే ఉన్నాయనుకోండి. కాని వాటి ధోరణి నిజమైన ఎద్దులదిగా లేదు. నిజమైన ఎద్దులు పోట్లాడుకునేటప్పుడు తోకలెత్తవు, ముడుచుకుంటాయి," అన్నాడు. తనకా సంగతి తెలీనందుకు సిగ్గుపడి చిత్రకారుడు బొమ్మలో ఎద్దుల తోకలను తగిన విధంగా మార్చేశాడు!

"మరి కొందరు అలవిగాని పనులకు పోయి మూఢుల్లాగా ప్రవర్తిస్తారు. దాని కొక చిన్న కథ చెబుతా. ఒక ఊళ్ళో ఒక గుడ్డి వాడుండే వాడు. వాణ్ణి చూసి వాడి బంధువొకడికి వల్లమాలిన జాలి పుట్టుకొచ్చింది. 'అయ్యో, పాపం, వీడు సూర్యభగవానుణ్ణి చూడనైనా చూడలేడుగదా. కనీసం వీడికి సూర్యుడు ఎలా ఉండేదీ చెబుదాం,' అనుకుని ఆ బంధువు, 'ఒరే, సూర్యుడు ఈ జేగంటలాగా ఉంటాడనుకోరా!' అని జేగంట మీద ఒక దెబ్బ కొట్టాడు గుర్తుగా. తరవాత ఆ గుడ్డివాడికి ఎక్కడో జేగంట మోత వినిపించింది. 'అదేనా సూర్యుడు?' అని అడిగాడు. బంధువు మరింత బాధపడి, 'కాదు, కాదు. సూర్యుడు దీనిలాగా వెలుగుతాడు,' అని చెప్పి ఒక మైనం వత్తి గుడ్డివాడి చేతి కిచ్చి తడవ నిచ్చాడు. మరి కొన్నాళ్ళయాక గుడ్డివాడి చేతికి ఒక పిల్లనగ్రోవి చిక్కింది. దాన్ని తడుముతూ వాడు, 'ఇదేనా సూర్యుడు?' అన్నాడు. తప్పు గుడ్డివాడిదా? కాదు, గుడ్డివాడికి సూర్యుణ్ణి వర్ణించి చెప్పాలనుకున్న బంధువుది."

"ఇంకా కథలు చెప్పు తాతయ్యా," అని పిల్లలు మారాం చేస్తూండగా అమ్మ వంటింటో నుంచి, "తాతయ్యను స్నానానికి వెళ్ళ నివ్వండ్రా!" అని కేక పెట్టింది.



# దాంభికుడు

ఒక పేదవాడు అడవికిపోయి కట్టెలు కొట్టి, వాటిని మోపుకట్టి, వీపున వేసుకుని బస్తీలో అమ్ముకోవటానికి వచ్చాడు.

బస్తీ వీధిలో జనం జాస్తిగా ఉన్నారు. పేదవాడి వీపున ఉన్న కట్టెలు బారు జాస్తిగా ఉన్నాయి. అందుచేత వాడు గొంతెత్తి, "తొలగండి, బాబూ! తొలగండి!" అని కేకలు పెడుతూ వీధి వెంట నడిచాడు.

వాడి కేక విని జనం తప్పుకుంటూ వచ్చారు. కాని ఒక దాంభికుడు పక్కకు తొలగలేదు. అతని బట్టలు కట్టెలకు పట్టుకుని చిరిగాయి. దాంభికుడికి మండిపోయింది. అతను ఆ పేదవాణ్ణి న్యాయాధికారి వద్దకు లాక్కుపోయి, వాడు తన బట్టలు చించాడని ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి పేదవాణ్ణి ఎన్నో ప్రశ్నలు వేశాడు. కాని పేదవాడు తల వంచుకుని బెల్లం కొట్టిన రాయిలాగా ఉండిపోయాడు. చివరకు న్యాయాధికారి విసిగి, "ఈ మూగ వెధవను నా దగ్గిరికి తెచ్చారేమిటి?" అని దాంభికుణ్ణి అడిగాడు. "అయ్యా, వీడిప్పుడు దొంగవేషం వేస్తున్నాడు. వీధిలో నడిచేటప్పుడు, 'తొలగండి, బాబూ, తొలగండి,' అని వీడు గావు కేకలు పెట్టటం నేను చెవులారా విన్నాను," అన్నాడు దాంభికుడు.

"అలాగా? వాడి కేకలు విని కూడా తొలగకపోవటం మీదే తప్పు. మీ ఫిర్యాదు కొట్టేస్తున్నాను," అన్నాడు న్యాయాధికారి.






# కృతాకృతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానాని కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒకందుకు నిన్ను చూస్తే నాకు సంతోషంగా వుంది; నీవు కృతాకృతుడి లాగా కాకుండా ఆరంభించిన పని అసాంతం నెరవేరేదాకా ప్రయత్నం మానటం లేదు. నీకు శ్రమ తెలియకుండా వుండగలందులకు ఆ కృతాకృతుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్ప సాగాడు:

ఒకప్పుడు కృతాకృతుడనే బ్రాహ్మణొకడుండే వాడు. వాడు వేదాధ్యయనం మాని, కులభ్రష్టుడై, అస్తమానమూ జూదరులతోనూ, విటులతోనూ, తాగుబోతులతోనూ తిరిగేవాడు. రాత్రివేళ ప్రేతభూములలో తిరుగుతూ, అక్కడి క్షుద్రోపాసకుల పరిచయం సంపాదించి, వారి సహాయంతో

బేతాళ కథలు

పొట్ట పోసుకుని అతి నీచమైన జీవితం జీవిస్తూ వచ్చాడు.

ఒకనాకు రాత్రి వాడు శ్మశానానికి వెళ్ళే సరికి అక్కడ శవాలు దహన మవుతున్నాయి. పిశాచాలు వికట నృత్యం చేస్తున్నాయి. అప్పుడొక బేతాళుడు కృతాకృతుణ్ణి సమీపించి, "నాకు నరమాంసం తెచ్చి పెడతావా? నిన్ను పీక్కు తినమన్నావా?" అని అడిగాడు.

"నరమాంసమైతే తేగలను గాని అందుకు నాకే మిస్తావు?" అని కృతాకృతుడు బేతాళుణ్ణి అడిగాడు.

"ఆరోగ్యవంతుడైన బ్రాహ్మడి మాంసం తెచ్చి పెట్టావంటే నీకు మృతసంజీవి మంత్రం చెబుతాను," అన్నాడు బేతాళుడు.

"ఆ మంత్రం ఒక్కటీ చాలదు. జూదంలో ఎల్లప్పుడూ గెలిపించే పాచికలు కూడా ఇచ్చావంటే నీవు కోరినట్టు బ్రాహ్మడి మాంసం తెస్తాను," అని కృతాకృతుడు బేరమాడాడు.

సరే, అలాగే కానిమ్మన్నాడు బేతాళుడు.

కృతాకృతుడు ఆరోగ్యవంతుడైన బ్రాహ్మణ్ణి చంపి ఆ మాంసం తెచ్చి బేతాళుడికిచ్చే ప్రయత్నం మీద బయలుదేరాడు. కాని ఇది వాడికి సాధ్యమయేపనిగా కనిపించలేదు. అందుచేత వాడు రహస్యంగా తన తమ్ముణ్ణి చంపి వాడి మాంసాన్ని అర్థరాత్రివేళకు ప్రేత భూమికి తెచ్చాడు. బేతాళుడా మాంసం తీసుకుని, అన్న ప్రకారం అజేయమైన పాచికలిస్తూ, మృతసంజీవి మంత్రంకూడా బోధించాడు.



తరవాత ఒకనాడు కృతాకృతుడు మృతసంజీవి మంత్రప్రభావం పరీక్షించగోరి, ఒక చచ్చిన చండాలుడి శవాన్ని అపరాత్రివేళ ప్రేత భూమికి తీసుకుపోయి, మృతసంజీవి మంత్రం పఠించ నారంభించాడు.

మంత్రం సగం పూర్తి అయేసరికల్లా శవం ఎడమ చెయ్యీ, ఎడమ కాలూ

ఆడించి, ఎడమ కన్ను విశాలంగా తెరిచి అటూ ఇటూ చూడసాగింది. శవం యొక్క కుడి పార్శ్వం మటుకు చచ్చేవున్నది.

ఈ భయానకమైన దృశ్యాన్ని చూడగానే కృతాకృతుడికి హడలు పుట్టింది. వాడు మిగిలిన మంత్రాన్ని మరిచిపోయి, ఒక్క గెంతుతో లేచి, కాలి సత్తువకొద్దీ పరిగెత్త సాగాడు. బేతాళుడు ఆవహించటంచేత శవం కూడా లేచి, ఒంటి కాలి మీద గెంతుతూ, "ఊనాధికాకృతంకృతం" అని అస్పష్టంగా అరుస్తూ అతణ్ణి వెంబడించింది.

కృతాకృతుడు వాయువేగంతో ఇల్లు చేరుకుని, తలుపులు గట్టిగా బిగించి, వణు కుతూ దుప్పటి కప్పుకుని పడుకుని, త్వర లోనే నిద్రపోయాడు. కాని ఒక రాత్రివేళ వాడికి నిద్రా భంగమై లేచి చూసేసరికి, తలుపు తెరుచుకుని చండాలుడి శవం ఎడమ కాలితో గెంతుతూ, ఎడమ కన్ను భయంకరంగా అటూ ఇటూ తిప్పుతూ, "ఊనాధికాకృతంకృతం" అంటూ వాడి కేసి రావటం కనిపించింది.

కృతాకృతుడు చివాలున పక్క మీదినుంచి దూకి మరొక ద్వారం తెరుచుకుని బయటికి పారిపోయి, ఒక గుర్రం ఎక్కి, అతివేగంగా దూరదేశానికి వెళ్ళి పోయాడు. అక్కడ ఒక పెద్ద నగరంలో స్థిర నివాసం ఏర్పాటు



చేసుకుని, చండాలుడి శవం పీడ వదిలింది గదా అనుకున్నాడు. వాడు అక్షయమైన తన పాచికలతో జూదంలో అందరినీ ఓడించి అంతులేని డబ్బు సంపాదించి, సమస్త భోగాలూ అనుభవిస్తూ, ఇతర జూదగాళ్ళకు విందులు చేస్తూ సుఖంగా కాలక్షేపం చెయ్యసాగాడు.

ఒకనాటి రాత్రి ఒక జూదపుటింట్లో వాడు పాచికలాడుతూండగా, సగం బతికిన చండాల శవం ఒంటి కాలిపై గెంతుతూ, ఒంటి కన్ను భయంకరంగా అటూ ఇటూ తిప్పుతూ, "ఊనాధికాకృతంకృతం" అంటూ అక్కడికి వచ్చింది.

కృతాకృతుడు దాన్ని చూసి కెవ్వున కేక పెట్టి, జూదం ఆడే బల్ల మీదుగా దూకి, మరొక వాకిలిగుండా బయటికి వెళ్ళి, ఏక పరుగున నగరం దాటి, అరణ్యానికి అడ్డం పడి ఎంతో దూరాన వున్న మరొక నగరం చేరుకున్నాడు. అక్కడ జూదపుటింట్లో వున్న వాళ్ళందరూ ఆ భీకరదృశ్యం చూసి, గుండెలవిసి చచ్చారు.

ఈ కొత్త నగరంలో కృతాకృతుడు కొంత కాలంపాటు మారువేషం వేసుకుని, కలుగులోని ఎలుకలాగా దాగివుండి, తరవాత ధైర్యం వచ్చి, తిరిగి జూదమాడి డబ్బు సంపాదించటం ఆరంభించాడు.



ఒకనాడు కృతాకృతుడు మేడ మీద తన ప్రేయసితో సహా కూచుని వుండగా చండాలుడి శవం వారున్న చోటికి ఒంటి కాలిపై గెంతుతూ, ఒంటి కన్నుతో నిప్పులు కక్కుతూ, "ఊనాధికాకృతంకృతం" అని భయంకరంగా అరుస్తూ వచ్చింది.

ఆ దృశ్యాన్ని చూడగానే కృతాకృతుడి ప్రియురాలు భయంతో పెద్దగా ఒక్క కేక పెట్టి ప్రాణాలు వదిలింది.

శవం నుంచి తప్పించుకోవటానికి కృతాకృతుడు మేడ మీది నుంచి వీధిలోకి దూకి తాను కూడా ప్రాణాలు వదిలాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. ఊనాధికాకృతంకృతం అనటంలో శవం యొక్క అభిప్రాయ మేమిటి? నీకు తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "'ఊనాధికాకృతంకృతం' అంటే, తక్కువ చేసినదీ, ఎక్కువ చేసినదీ, అసలే చెయ్యనిదీ అని అర్థం. ఈమాటల్లో వుండే అర్థం స్పష్టంగా తెలుస్తూనే వున్నది. ప్రారంభించిన పని పూర్తి చెయ్యటానికి సాహసం లేనివారు ఎక్కువైనా చేస్తారు, తక్కువైనా చేస్తారు. అందుచేత వారు ఉభయభ్రష్టు లవుతారు. సన్మార్గులు నీచయత్నాలు ఆరంభించనే ఆరంభించరు. పాపకృత్యాలు చేసే సాహసం గల దుర్మార్గులు తమ ప్రయత్నాలను చివరంటా సాగించి వాటి సత్ఫలితాలను ఈ లోకంలో నైనా అనుభవిస్తారు. పిరికి వాళ్ళు ఈ రెండు తరగతుల కిందరారు. వారు పాపపు కార్యాలను ఆరంభిస్తారు గాని వాటిని ముగించే సాహసం వుండదు; వారు ఉభయభ్రష్టులై పోతారు. ఇదే శవం అన్నమాటలకు అర్థం," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# అన్నా-చెల్లెలు

## 2

తనకు సవితి కాబోతున్న కూతల్ కులూబ్‌ను మాయోపాయం చేత మందు పెట్టి శ్మశానంలో నౌకర్ల చేత పాతిపెట్టించినాక జుబేదారాణికి ఒక పెద్ద సమస్య పట్టుకున్నది—ఖలీఫా త్వరలోనే యుద్ధం నుంచి తిరిగి వస్తాడు, కూతల్ కులూబ్ గురించి అడుగుతాడు; అప్పుడాయనకు తానేమని జవాబు చెప్పాలి?

ఈ విషయం ఆమె తన ముసలి దాసిని రహస్యంగా సలహా అడిగింది. ఈ ముసలిది అన్ని రకాల జిత్తులూ తెలిసిన ముసలి నక్క. అది రాణితో, "ఈ సమస్యను పరిష్కరించటానికి, ఒక ఉపాయం కాదు, వెయ్యి ఉపాయాలు చెప్పగలను. కాని అన్నిటికన్న ఉత్తమమైన దేమిటంటే, వడ్రంగి చేత ఒక కొయ్య బొమ్మ చేయించి, దాన్ని ఖరీదైన శవాల పెట్టెలో పెట్టి, నీవూ నీ పరివారమూ కలిసి దివాణంలోనే శాస్త్రోక్తంగా పాతేయించటం. ఖలీఫాగారు తిరిగి వచ్చాక, కూతల్ కులూబ్ చనిపోయిందనీ, ఆమెకు రాజవైభవం ఏమీ తక్కువలేకుండా ఉత్తరక్రియలు చేసి సమాధి కట్టించాననీ చెప్పవచ్చు. ఆయన నాలుగు చుక్కలు కన్నీరు కార్చి, సమాధి దగ్గిర కొరాను చదివిస్తాడు. ఒకవేళ నీ మాట నమ్మక సమాధి తెరిపించినా కూడా, లోపల శవపేటిక వుంటుంది. అందులో ఖరీదైన దుస్తులూ, నగలూ తొడిగిన కొయ్య బొమ్మ వుంటుంది. శవాన్ని తాకి చూడటం దోషం గనక ఖలీఫా గారు అంత దూరం వెళ్ళరు. నీ చిక్కు తీరిపోతుంది," అని సలహాగా చెప్పింది.

రాణి తృప్తిపడి ముసలిదానికి బట్టలూ, బంగారమూ ఇచ్చి దాని సలహా ప్రకారమే వడ్రంగి చేత ఒక కొయ్య బొమ్మ తయారు

సి. మాధవరావు



చేయించి, దానికి నగలుపెట్టి, మంచిమంచి బట్టలు కట్టి, ముఖం కప్పి, శవం పెట్టెలో ఆ బొమ్మను పెట్టి, దివిటీలూ, కొవ్వొత్తులూ మొదలైన వాటితో ఆ బొమ్మను సమాధి చేయించి, సమాధి మీద మంచి గోరీకూడా కట్టించింది. ఈ ఉత్తరక్రియలలో అంతః పురంలోని దాసీ జనమంతా పాల్గొన్నారు. కంబళ్ళు పరిచి ప్రార్థనలు చేశారు. దివాణ మంతటా నల్ల బట్టలు కట్టారు. నౌకర్లు మైల బట్టలు ధరించారు. కూతల్ కులూబ్ చని పోయిందన్న వార్త దివాణ మంతటా పాక్కింది. మస్రూర్ వంటి ఖలీఫా అంత రంగికులు సయితం ఈ వార్త నమ్మారు.



త్వరలోనే ఖలీఫా యుద్ధం నుంచి తిరిగి వచ్చాడు. ఆయన ప్రాణాలన్నీ కూతల్ కులూబ్ పైనే వున్నాయి. ఆమె మరణ వార్త వింటూనే ఆయన మొదలు నరికిన చెట్టు లాగా పడిపోయాడు. స్పృహ తెలిసినాక ఆయన తన ప్రియురాలి సమాధి చూస్తా నన్నాడు. "ఆమెపై గల మమత కొద్దీ ఆమెను నా ఇంటి ఆవరణలోనే సమాధి చేయిం చాను," అన్నది జుబేదా రాణి. ఖలీఫా ప్రయాణపు దుస్తులన్నా మార్చుకోకుండా సమాధి వద్దకు వెళ్ళాడు. అక్కడ పరిచిన తివాసీలూ, వెలుగుతున్న కొవ్వొత్తులూ చూసి తృప్తిపడి, రాణి చేసిన ఏర్పాట్లకు తన కృతజ్ఞత తెలిపాడు.

కాని త్వరలోనే ఆయనను అనుమానాలు వేధించసాగాయి. ఆయన సమాధి తెరిపించి, శవం వుండే పెట్టెను చూసిన దాకా ఆ అనుమానాలు తీరలేదు. తరవాత నెల రోజులపాటు ప్రతి రోజూ ఆ గోరీ వద్ద కొరాను పఠనం జరిపించి, తానుకూడా అక్కడే వుండి తన ప్రియురాలి కోసం కన్నీరు కారుస్తూ వచ్చాడు. ఆఖరు రోజు ప్రార్థనలు ఉదయం నుంచి మరుసటి ఉదయం దాకా ఆగకుండా జరిగాయి. ఆ తరవాత ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.



నెలరోజులుగా ఏడుస్తూ వుండటం చేతా, ఆఖరు రోజంతా నిద్రలేక సొమ్మసిల్లి పోవటంచేతా ఖలీఫా తన భవనానికి తిరిగి వస్తూనే గాఢనిద్రలో మునిగి పోయాడు.



ఒక గంట అయినాక ఆయనకు నిద్రా భంగం కలిగే సమయానికి ఖలీఫా కాళ్ళ దగ్గిరా, తల దగ్గిరా కూచుని వున్న దాసీలు చిన్న గొంతుతో మాట్లాడు కోవటం వినిపించింది. ఆయన కళ్ళు తెరవకుండానే వారి సంభాషణ ఆలకించాడు.

"పాపం, ఖలీఫాగారి కెంత దుర్గతి పట్టింది? ఆయన ఉత్తుత్త సమాధి దగ్గిర అశ్రు తర్పణాలు విడవటమేమిటి?, అందులో ఏమున్నది—కొయ్య బొమ్మ తప్ప?"

"అసలు శవాన్ని జుబేదారాణి శ్మశానంలో పాతేయించిందటగా? కూతల్ కులూబ్‌కు భంగు పెట్టి స్పృహలేకుండా చేసి, ప్రాణాలతోనే పాతేయించిందన్నారు."

"పాపం, కూతల్ కులూబ్ అంత ఘోర మరణం పాలయిందా?"

"దేవుడి దయవల్ల ఆ గండం తప్పించిలే. ఆమె ఎలాగో తప్పించుకుని ఇన్ని నెలలుగా ఘానిం అనే డమాస్కస్ వర్తకుడి ఇంట రహస్యంగా వుంటున్నదట. ఈ సంగతి ఎలాగో జుబేదారాణికి కూడా తెలిసిపోయింది! అక్కడ వాళ్ళిద్దరూ హాయిగానే వుండి వుంటారు. ఇక్కడ కలీఫాగారు మాత్రం దుఃఖంతో అలమటించి పోతున్నారు."

ఈ మాటలన్నీ విన్న ఖలీఫా శివం ఎత్తిన వాడల్లే పెద్ద పెడబొబ్బ పెట్టి, పక్క మీది నుంచి చివాలున లేచి, "జాఫర్! జాఫర్ ఎక్కడ?" అని కేకలు పెట్టాడు. మంత్రి అయిన జాఫర్ రాగానే ఆయన అతనితో, "నీవు వెంటనే భటులతో వెళ్ళి, ఘానిం అనే డమాస్కస్ వర్తకుడి ఇల్లు చుట్టు ముట్టి, అక్కడ వున్న నా కూతల్ కులూబ్‌ను విడిపించి తీసుకురా. ఆ ఘానిం



అనే ద్రోహిని బంధించి పట్టుకురా, వాణ్ణి చిత్రహింస చెయ్యాలి," అన్నాడు.

జాఫర్ భటులనూ, నగర రక్షకుణ్ణీ పిలిపించి, ఘానిం అనే వాడి ఇల్లు ఎక్కడ వున్నదీ ఆరాతీసి, ఖలీఫా ఆజ్ఞను పాలించటానికి బయలుదేరాడు. అతను భటులతో వచ్చి చేరే సమయానికి ఘానిం, కూతల్ కులూబ్‌లు భోజనం చేస్తున్నారు. ఆమె కిటికీ గుండా రాజభటుల అట్టహాసం గమనించి, కొంప మునిగిందని తెలుసుకుని, "ఘానిం, ప్రమాదం! ఖలీఫా నిన్ను బతకనివ్వడు! ప్రాణాలతో పారిపో!" అని ఆక్రందనం చేసింది.

రాజభటులు అప్పటికే చుట్టు ముట్టిన ఇంటి నుంచి ప్రాణాలతో బయట పడటం ఎలాగో ఘానింకు తెలియులేదు. ఆ ఉపాయంకూడా ఆమే చేసింది. ఆమె అతని దుస్తులు చించి, చింకి పాతలు పైన తొడిగి, ఒక కుండలో ఎంగిలి పదార్థాలన్నీ వుంచి, ఆ కుండను అతని నెత్తిన పెట్టి, "ఇలా బయటికి వెళ్ళు. బానిసవాడి వనుకుని రాజభటులు నీ జోలికి రారు. నా విషయం దిగులు వద్దు! ఖలీఫా నా కెన్నటికీ హాని చేయడు!" అన్నది.

ఆమె చెప్పినట్టే భటులు ఘానింను నిరాక్షేపణగా బయటికి పోనిచ్చారు. అతను వెళ్ళిన కొద్దిసేపటికే జాఫర్ గుర్రమెక్కి ఆ ఇంటికి చేరుకున్నాడు. ఆయన లోపలికి అడుగుపెట్టేసరికి కూతల్ కులూబ్ చక్కగా ముస్తాబై ఒంటరిగా వున్నది. జాఫర్‌ను చూడగానే ఆమె వందనం చేసింది.

"అమ్మా, ఘానిం అనే వాణ్ణి పట్టుకు రమ్మని నాకు ఉత్తరువయింది. అతను ఎక్కడ వున్నదీ నీకు తెలుసునా?" అని జాఫర్ ఆమె నడిగాడు.

"తెలుసును. కొంతకాలం కిందట అతను తన తల్లినీ, తోడబుట్టువునూ చూడటానికి డమాస్కస్‌కు బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఆ పైన నా కేమీ తెలీదు. ఈ పెట్టె మాత్రం నాది. అందుచేత దీన్ని దివాణానికి జాగ్రత్తగా చేర్పించండి," అన్నదామె.

జాఫర్ తన వెంట వున్నవారిలో కొందరిని పెట్టె ఎత్తుకోమని చెప్పి, ఆమెను తన వెంట ఖలీఫా వద్దకు వేంచేయవలసిందిగా ప్రార్థించాడు. తరవాత ఆయన మిగిలిన భటులతో, "ఈ ఇల్లు కొల్లగొట్టి, ఇంటికి నిప్పు అంటించి వచ్చేయండి. ఇది ఖలీఫాగారి ఆజ్ఞ," అన్నాడు.

ఆయన ఆమెను వెంట బెట్టుకుని ఖలీఫా వద్దకు వెళ్ళి, ఘానిం డయాస్కస్‌కు వెళ్ళిపోయాడని చెప్పాడు. తన ప్రియురాలు అదివరకే ఘానింకు ఉంపుడుకత్తె అయిపోయి వుంటుందన్న ఆగ్రహావేశంతో ఖలీఫా ఆమెను చీకటి కొట్టులో వెయ్యమని తన అంగరక్షకుడైన మస్రూర్‌ను ఆజ్ఞాపించాడు.

ఇంక ఘానింను పట్టుకుని శిక్షించవలసి వున్నది. అతనిని వెతకటానికి అశ్వికభటులను పంపుతూ ఖలీఫా, తన సామంతుడైన డమాస్కస్ సుల్తానుకు ఒక ఉత్తరం రాశాడు. ఘానిం అనే డమాస్కస్ యువకుడు, అయ్యూబ్ అనే వాడి కుమారుడు, వర్తకంమీద బగ్దాదుకు వచ్చి, తన ప్రియురాలైన ఒక స్త్రీతో సంబంధం పెట్టుకుని, తన ఆగ్రహానికి వెరిచి డమాస్కస్ పారి



పోయి, అక్కడ తన తల్లీ చెల్లెళ్ళ చాటున తలదాచుకున్నాడనీ, అతన్ని పట్టి తన వద్దకు పంపినట్టయితే తాను తగిన రీతిగా శిక్షిస్తాననీ, అతనికి ఆశ్రయం లభించిన ఇంటిని నేలమట్టం చేసి ఆ ఇంట్లో వుండే వారికి నగర బహిష్కార శిక్ష విధించమనీ ఖలీఫా ఆ ఉత్తరంలో రాశాడు.

వారం రోజుల కల్లా ఈ ఉత్తరం డమాస్కస్ సుల్తానుకు చేరింది. ఆయన దాన్ని చదువుతూనే, "ఘానిం ఇంటిని ఎవరు పడితే వారు కొల్లగొట్టుకోవచ్చు," అని చాటింపు వేయటానికి ఉత్తరువిచ్చాడు. తరవాత ఆయన కొందరు భటులతో ఘానిం ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. ఘానిం చెల్లెలు ఫిత్నా తలుపు తెరిచి, సుల్తానును చూడగానే ముఖం కప్పుకుని తన తల్లితో చెప్పటానికి పరుగెత్తింది.

ఘానిం తల్లి తన కొడుకు జాడ తెలియనందున అతను చనిపోయినాడని రూఢి చేసుకుని, అతని పేర ఒక చిన్న గోరీ కట్టి, నిద్రాహారాలు మాని ఏడుస్తూ ఆ గోరీ దగ్గిరే పడి వుంటున్నది. సుల్తాను వచ్చాడని విని ఆమె తన కుమార్తెతో, "సుల్తానుగారిని ఇలా దయచెయ్యమను," అన్నది.

సుల్తాను ఆమె వున్న చోటికి వచ్చి, "ఘానింను పట్టుకుని ఖలీఫా వారి వద్దకు పంపటానికి వచ్చాను," అన్నాడు.

"ఏం చెప్పను, బాబూ? నా కొడుకు ఘానిం మమ్మల్ని విడిచి వెళ్ళి ఏడాది దాటింది. వాడేమయాడో కూడా మాకు తెలియదు," అన్నది ఘానిం తల్లి.

సుల్తాను దయగలవాడే గాని ఖలీఫా ఉత్తరువు పాలించక గత్యంతరంలేదు. ఆయన వారి ఇంటిని నేల మట్టం చేయించి, ఆ తల్లి కూతుళ్ళ దుస్తులుకూడా ఒలిపించి, అతి కొద్దిపాటి దుస్తులతో వారిని నగరం నుంచి వెళ్ళగొట్టాడు.

—(ఇంకా వుంది)



# స్నేహితులు





# పచ్చిమోసం

బలుసుపాడులో బాపనయ్యా అనే వర్తకుడున్నాడు. ఆ ఊళ్ళోనే రామయ్యా అనే ఆసామి వుంటున్నాడు. రామయ్యాకు కుటుంబ అవసరాలకు ఒక పాతిక రూపాయలు కావలసి వచ్చినవి. ఎవరినైనా అడుగుదామంటే తనను నమ్మి ఊళ్ళోవాళ్ళెవరూ దమ్మిడీ కూడా ఇవ్వరని రామయ్యాకు తెలుసు. రామయ్యా ఎప్పుడూ బాపనయ్యాను అడిగివుండలేదు. అందుచేత వడ్డీ ఆశ చూపి మెల్లగా బాపనయ్యా దగ్గర డబ్బు లాగాలనుకున్నాడు.

"బాపనయ్యా బాబూ! ప్రాణం మీదికి వచ్చింది. మళ్ళీ ఈ వారం నాటికి పువ్వుల్లో పెట్టి నీవు కోరిన వడ్డీతో నీ చేతులోపెడతా. ఒక్క పాతిక రూపాయలు ఇద్దూ," అని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు రామయ్యా.

బాపనయ్యా సామాన్యంగా చెయిజారే మనిషి కాదు. ఇంకెవరికన్నా ఐతే ఇచ్చేవాడేమోగాని, రామయ్యాకు ఇస్తే వడ్డీమాట అలావుంచి అసలు గల్లంతు అవుతుందని బాపనయ్యాకు అపనమ్మకం. అందువల్ల నాలుగు తియ్యటి మాటలు చెప్పి రామయ్యాను సాగనంపుదామనుకున్నాడు.

"రామయ్యా! ఎన్నడూ అడగనివాడివి నోరుతెరిచి అడిగావు. ఏంచేసేది? సొమ్మంతా వ్యాపారంలో బిగిసి పోయింది. లేకపోతే, నీ కిస్తే యెక్కడికి పోతుంది. లేదన్నానని మరేమీ అనుకోకేం!" అని అతి వినయంగా చెప్పాడు బాపనయ్యా.

బాపనయ్యా ఎంత వినయంగా చెప్పినా తనకు ఇవ్వడానికి ఇష్టంలేకనే ఇలా నాటకం ఆడాడని గ్రహించాడు, రామయ్యా. "సరే! ఇంకొకచోట చూస్తాలే," అని వెళ్ళిపోయాడు. కాని బాపనయ్యా దగ్గర నుంచి ఏవిధంగానైనా డబ్బు రాబట్టాలని రామయ్యా నిశ్చయించుకొన్నాడు. కూర్చున్నా,

ఎ. వీరబ్రహ్మము

నుంచున్నా దీనిని గురించే ఆలోచించడం ఆరంభించాడు. ఆఖరికి అతనికి ఏదో ఆలోచన వచ్చినట్టుంది. చరచరా బాపనయ్య కొట్టు దగ్గరకు వెళ్ళాడు.

కొట్లో బాపనయ్య ఒక్కడే కూర్చొని వున్నాడు. ఇదే సమయమని రామయ్య బాపనయ్యను సమీపించి, "ఇదుగో, బాపనయ్యా! ఐదుపదు లెంత ?" అని ప్రశ్నించాడు. రామయ్య లెక్క తెలియక అడుగుతున్నాడనుకొని "యాభై కదటయ్యా!" అన్నాడు బాపనయ్య. "బాగుంది నీ తెలివి! అరవై కదూ ?" అన్నాడు రామయ్య తీవ్రంగా. "భలే వాడివిలే, యాభై," అన్నాడు బాపనయ్య. "ఏయ్! జాగ్రత్తగా మాట్లాడు, అరవై!" అన్నాడు పెద్దగా కేకలుపెడుతూ రామయ్య. "యాభై!" అన్నాడు బాపనయ్య అంతకంటె పెద్దగా.

ఈ విధంగా బాపనయ్య, రామయ్య యాభై, అరవై అని కేకలు పెట్టుకోవడం విని చుట్టుపక్కల వాళ్ళంతా బాపనయ్య కొట్టు దగ్గిరకు వచ్చి, "ఏమిటయ్యా, మీ అరుపులు ?" అని ప్రశ్నించారు.

"చూడండి! ఈ పెద్దమనిషి, నాకు టోపీపెట్టడానికి చూస్తున్నాడు. నేను ఇతని దగ్గర అరవై రూపాయలు దాచుకున్నాను. తీరా నాకు అవసరమొచ్చి ఇప్పుడు అడిగితే,



యాభయ్యే నంటున్నాడు,'' అన్నాడు రామయ్య, నిజంగా సొమ్ము పోయినవాడిలా.

బాపనయ్య దిగ్భ్రాంతి చెందాడు. "అరి పిడుగా! నా దగ్గర నువ్వు డబ్బుదాచావా? ఎంత అన్యాయం! ఎంత అన్యాయం! అంతా ఒట్టిదే బాబూ!'' అని జరిగిన విషయం పెద్దమనుషులకు చెప్పబోయాడు బాపనయ్య. రామయ్య అతడి మాటను చొరవ నివ్వలేదు "ఇదుగో, బాపనయ్యా! నీ నాటకం ఇక కట్టిపెట్టు. ఇందాకటి నుంచీ యాభై అని ఇప్పుడు అసలే లేదంటున్నావా? ఆ పదిరూపాయలు తింటే తిన్నావుగాని నువ్వన్న ఆ యాభైరూపాయలు నా మొహాన పారెయ్! జన్మలో ఇంకెవరి దగ్గరా డబ్బు దాచిపెట్టకుండా బుద్ధి చెప్పావు. ఈ పది రూపాయలతోనే బాగుపడి పోవులే, కానియ్!'' అన్నాడు రామయ్య ఎంతో చాకచక్యంగా. అక్కడ చేరిన వాళ్ళందరూ రామయ్య మాటలు నమ్మేశారు. వాళ్ళు నిజంగా రామయ్య బాపనయ్య దగ్గర డబ్బు దాచాడనుకున్నారు.

"బాపనయ్యా! వాడు అరవై రూపాయలు దాచుకుంటే యాభయ్యే సంటివి. నువ్వు అన్నప్రకారం ఆ యాభయ్యే ఇవ్వమంటున్నాడుగదా! మొత్తం కైంకర్యం చెయ్యాలంటే ఎట్లా చెప్పు? దేనికైనా న్యాయం ఉండొద్దూ! మర్యాదగా యాభై రూపాయలు ఇచ్చి పంపెయ్!'' అని తీర్పు చెప్పారు అక్కడ చేరినవాళ్ళంతా. ఇంకా స్సేపు ఆగితే అరవై రూపాయలు ఇవ్వమని తీర్పు చెప్తారేమోనని పాపం, బాపనయ్య కిక్కురు మనకుండా యాభై రూపాయలు రామయ్య దోసిట్లో పోశాడు.

చూశావా! నా తడాఖా, అన్నట్టు చూస్తూ రామయ్య చక్కాపోయాడు.

పాతిక రూపాయలు అప్పు ఇవ్వనందుకు బూటకం చేసి రెట్టింపు తీసుకుపోయాడని బావురుమన్నాడు పాపం; బాపనయ్య!






భరతుడు రాముడి ఆజ్ఞానుసారం లేచి జలం స్పృశించి రాముణ్ణి తాకి అందరి తోనూ ఈ విధంగా అన్నాడు : "మీరంతా వినండి. నేను నా తండ్రిని రాజ్యం కోర లేదు, నా తల్లినీ కోరలేదు. రాము డడవికి వెళ్ళటం నాకు సమ్మతంకాదు. రాముడి బదులు నేను పధ్నాలుగేళ్ళూ వనవాసం చేస్తాను, నాకు బదులు రాముణ్ణి రాజ్యం చెయ్యమనండి. తండ్రి ఆజ్ఞ పాలించి నట్టవుతుంది."

ఈ మాటలు విని రాముడు నిర్ఘాంత పోయి, "ఇలా రాజ్యాన్ని, వనవాసాన్ని మార్పు చేసుకోవటం పితృవాక్య పరిపాలన ఎలా అవుతుంది? నేను వనవాసం చెయ్యటం మాని రాజ్యం ఏలటం కన్న ఘోరమైన తప్పు ఉండదు. ఈ పధ్నాలు గేళ్ళూ పూర్తికాగానే నేనూ భరతుడూ కలిసి రాజ్యంచేస్తాం," అన్నాడు.

చుట్టూ చేరిన వారు రాముడి మాటలకూ, భరతుడి మాటలకూ కూడా సంతోషిం చారు. వారు భరతుడితో, "నాయనా, రాముడు చెప్పినట్టు చెయ్యి. అతన్ని తండ్రి ఋణం తీర్చుకోనీ!" అన్నారు. రాముడు సంతోషించాడు గాని భరతుడి గుండెలో రాయిపడింది.

చివర కతను రాముణ్ణి పాదుక లిమ్మని అడిగాడు. రాముడు ఆ పాదుకలను కాళ్ళకు వేసుకుని భరతుడికి ఇచ్చాడు. భరతుడు రాముడితో, "నీవు కాకపోతే నీ పాదుకలే లోకాన్ని రక్షిస్తాయి. నేను



మునివేషంతో, ఫలమూలాలు తింటూ, రాజ్యభారం ఈ పాదుకలకు అప్పగించి, ఊరి బయట ఉండి నీ రాక కోసం ఎదురు చూస్తూ ఉంటాను. పధ్నాలుగేళ్ళూ దాటిన మర్నాడు నీవు రాకపోయావో, అగ్నిప్రవేశం చేస్తాను," అన్నాడు.

రాముడిందుకు సరేనని, భరతుణ్ణి కౌగలించుకుని, "నీ తల్లిని రక్షించు. ఆమె మీద ఆగ్రహించావో నా మీదా, సీత మీద ఒట్టు! ఇక వెళ్ళి రా," అంటూ కన్నీరు కార్చాడు.

భరతుడు బంగారు అలంకారాలు గల రామపాదుకలను పూజించి, రాముడికి ప్రదక్షిణం చేశాడు. తరవాత రాముడు తన తల్లులనూ, ఇతరులనూ సాగనంపి పర్ణశాలకు తిరిగివచ్చాడు.

భరతుడు రాముడి పాదుకలను నెత్తిన పెట్టుకుని, శత్రుఘ్నుడితో సహా రథమెక్కాడు. వసిష్ఠ వామదేవ జాబాలి మొదలైన వారు ముందు సాగారు. భరతుడు సపరివారంగా తిరుగుప్రయాణంలో భరద్వాజాశ్రమానికి వచ్చాడు. ఆయనతో జరిగినదంతా చెప్పి, ఆయన వద్ద సెలవు పుచ్చుకున్నాడు. శృంగిబేరపురం మీదుగా ప్రయాణించి అతను చివరకు అయోధ్య చేరుకున్నాడు. అయోధ్య వీధుల కుండా రథమెక్కి వస్తుంటే అతనికి నగరం నిర్జీవంగా కనబడింది. అతను శత్రుఘ్నుడితో, "అయోధ్య కళ అంతా రాముడితోనే పోయింది," అన్నాడు.

భరతుడు తన తల్లులను అయోధ్యకు తెచ్చి వసిష్ఠుడు మొదలైన వారితో, "రాముడు లేని అయోధ్యలో ఉండలేను, నందిగ్రామానికి పోయి, అక్కడినుంచే రాజ్యం చూస్తూ రాముడి రాకకు ఎదురు చూస్తూ ఉంటాను," అన్నాడు. ఈ ఏర్పాటుకు మంత్రులు కూడా సమ్మతించారు. భరతుడు తల్లుల దగ్గిర సెలవు పుచ్చుకుని,



శత్రుఘ్నుడితో బాటు రథమెక్కి, మంత్రులనూ, వసిష్ఠుణ్ణీ వెంటబెట్టుకుని నంది గ్రామానికి బయలుదేరాడు.

తన వెంట రమ్మని అతను ఆజ్ఞాపించకపోయినప్పటికీ సేన కూడా అతని వెంట నంది గ్రామానికి కదిలింది.

నందిగ్రామంలో పాదుకలకు శ్వేతచ్ఛత్రమూ ఇతర రాజమర్యాదలూ జరగాలని భరతుడు ఉత్తరు విచ్చాడు. తన తల్లి మూలంగా తనకు కలిగిన అపకీర్తి పోగొట్టుకోవటానికి మహాత్ముడైన భరతుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, మునివేషం వేసుకుని నందిగ్రామంలో ఉండి కోసలదేశాన్ని పరిపాలించాడు. రాజతంత్రం ప్రతిదీ ఆ పాదుకలకు చెప్పుకునేవాడు. సామంతులు తెచ్చిన కానుకలను పాదుకలకు నైవేద్యం పెట్టేవాడు. రాముడికి జరగవలసిన పట్టాభిషేకం ఈ విధంగా రామ పాదుకలకు జరిగింది.

భరతుడు వెళ్ళినాక రాముడు కొంత కాలం ఆ పర్ణశాలలోనే ఉన్నాడు. క్రమంగా అతనికి ఒక విషయం తెలిసివచ్చింది : ఆ ప్రాంతంలో ఉండే ఆశ్రమాలకు చెందిన మునులు రాముణ్ణి చూపించి ఏవో గుసగుసలాడుకుంటున్నారు. దీనికి తోడు



వారంతా తమ ఆశ్రమాలు విడిచి వెళ్ళిపోబోతున్నారని కూడా తెలిసింది.

ఇదంతా ఏమిటో తేల్చుకోవాలనుకుని రాముడు మునులకు కులపతి అయిన ముసలి ముని వద్దకు వెళ్ళి, "మీరంతా ఆశ్రమాలు విడిచిపోతున్నారట. నేనుగాని, నా తమ్ముడుగాని, నా భార్యగాని తెలియక చేయకూడని పని ఏదైనా చేయలేదు గద?" అని అడిగాడు.

దానికి కులపతి, "మీరేమీ చెయ్యలేదు గాని, నీ కారణంగా రాక్షసులు మునులకు మహా భయం కలిగిస్తున్నారు. రావణుడి తమ్ముడు ఖరుడనే వాడు జనస్థానంలో చేరి

అక్కడి మునులను పారదోలాడు. ఎప్పుడో మాకూ పీడ చుట్టుకుంటుంది. అందుచేత ఈ ప్రాంతం వదిలి పోవాలనుకుంటున్నాం. యోధుడివి, అందులోనూ భార్యతో ఉంటున్నవాడివి; నీకైనా ఈ చోటు వదలటమే మంచిది," అన్నాడు.

తరవాత అక్కడి మునులు చాలా దూరాన ఉండే మరొక ఆశ్రమానికి వెళ్ళిపోయారు. రాముడు మాత్రం కొంతకాలం అక్కడే ఉండి తాను కూడా ఆ ప్రాంతం విడిచిపెడితే మంచిదని నిశ్చయించుకున్నాడు. ఆ ప్రకారమే అతను సీతాలక్ష్మణులతో బయలుదేరి అత్రిమహాముని ఆశ్రమానికి వెళ్ళాడు. ఆయన వారిని తన బిడ్డలలాగా ఆదరించి, తానే స్వయంగా వారికి అతిథి సత్కారాలు చేశాడు.

తరవాత అత్రిమహాముని జగద్విఖ్యాతురాలైన తన భార్య అనసూయను పిలిచి, ఆమెకు వారిని పరిచయం చేశాడు. అనసూయ ఇప్పుడు చాలా వృద్ధురాలు. జుట్టంతా తెల్లబడిపోయింది, అవయవాలు సడలిపోయాయి. కాని ఆమె తపశ్శక్తి సాటిలేనిది.

అత్రిమహాముని రాముడితో, "ఒకప్పుడు వర్షంలేక పదేళ్ళపాటు కరువువస్తే ఈమె తన తపశ్శక్తితో గంగను ప్రవహింప జేసి





మునులకు ఫల మూలాలు ఉత్పత్తి అయే టట్టు చేసింది. పదిరాత్రులు ఒకే రాత్రిగా ఉండేలాగ మరొక సందర్భంలో చేసింది. సీతను ఈమెకు నమస్కారం చెయ్యమను," అన్నాడు.

రాముడు సీతతో, "ఈ మహాత్ముడి మాట విన్నావు కదా, అనసూయాదేవికి నమస్కరించు. అందువల్ల నీకు శ్రేయస్సు కలుగుతుంది," అన్నాడు.

సీత అనసూయకు తన పేరు చెప్పుకుని నమస్కారం చేసి ఆమెను కుశల మడిగింది. అనసూయ సీతను చూసి ఎంతో ముచ్చటపడి, "తల్లీ, నీవు బంధువులనూ, ఐశ్వర్యాన్నీ, అహంకారాన్నీ, సమస్తాన్నీ విడిచి భర్త వెంట పాతివ్రత్య ధర్మంగా అరణ్యాలకు వచ్చావే, నీ భాగ్యమే భాగ్యం! అమ్మా, నేను ఎంతగానో ఆలోచించి చూశాను, స్త్రీని సమస్తవేళలా భర్తలాగా రక్షించేవారు మరెవరూ లేరు. నీ విలాగే భర్తను అనుసరించి ఉంటూ పాతివ్రత్య ధర్మం నెరవేర్చు," అని చెప్పింది.

"నా భర్త గుణవంతుడు, దయామయుడు, ధర్మాత్ముడు, నా మీద అచంచలమైన ప్రేమగలవాడు, నాకు తల్లి వంటి వాడు, తండ్రి వంటివాడు, మోహనాకారుడు; అటువంటి భర్తను సేవించ



కానికేం? నేను చిన్నతనం నుంచీ పతివ్రతా ధర్మాలు తెలుసుకున్నాను. అడవికి వచ్చే టప్పుడు నా అత్త కౌసల్య కూడా నాకా ధర్మం బోధించింది. ఇప్పుడు మీ నోట కూడా అవే వింటున్నాను," అన్నది సీత ఎంతో వినయంగా.

సీత తియ్యగా మాట్లాడుతూంటే అన సూయకు ఎంతో ముచ్చట అయింది. ఆమె సీతతో, "అమ్మా, నీ కేమైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీర్చుతాను," అన్నది.

సీత ఈ మాట విని ఆశ్చర్యపడి, "మీరో మాట అనటమే నాకు పదివేలు," అని సమాధాన మిచ్చింది.

"అయినా నా సంతోషం కొద్దీ ఇచ్చేది నీవు తీసుకోవాలి," అంటూ అనసూయ సీతకు ఒక దివ్యమైన పుష్పమాలా, ఒక చీరా, కొన్ని ఆభరణాలూ, శరీరానికి పూసు కునే పూతా, మంచి పరిమళగంధమూ ఇచ్చింది.

తరవాత అనసూయ సీతతో, "నీ భర్త నిన్ను స్వయంవరంలో పెళ్ళాడాడని విన్నాను. ఆ కథంతా చెబుతావా, అమ్మా?" అని అడిగింది.

సీత తన వృత్తాంతమంతా అనసూయకు చెప్పింది: "మా తండ్రి జనకమహారాజు మిథిలకు రాజు. ఆయన యాగం కోసం నాగ లితో భూమిని దున్నుతూ ఉండగా మట్టిలో నే నాయనకు దొరికాను. ఆయన కప్పటికి సంతానం లేకపోవటం చేత నన్ను తన కుమార్తెగా భావించి, పెంచమని తన పెద్ద భార్య కిచ్చాడు. నాకు పెళ్ళియీడు వచ్చాక ఆయనకు పెద్ద విచారం పట్టుకున్నది. ఎంత ఆలోచించినా నాకు తగిన భర్త ఆయ నకు దొరకలేదు. అప్పు డాయన నాకు స్వయంవరం చేద్దామని నిశ్చయించి, తన ఇంటనున్న గొప్ప విల్లును ఎక్కుపెట్టిన వాడికి నన్నిచ్చి పెళ్ళిచేయ నిర్ణయించాడు. ఎందుకంటే, దైవాంశ ఉన్నవారు తప్ప

మామూలు మనుష్యులు దానిని ఎత్తనైనా శక్తిలేని వారవుతారు. ఎందరో రాజులు స్వయంవరానికి వచ్చి, ధనుస్సును ఎత్తలేక దణ్ణంపెట్టి వెళ్ళిపోయారు. అంతలో విశ్వామిత్రమహాముని రామలక్ష్మణులతో సహా యజ్ఞం చూడవచ్చాడు. విశ్వామిత్రుడు కోరగా మా తండ్రి ఆ ధనుస్సును తెప్పించి వారికి చూపాడు. రాముడా ధనువును అవలీలగా ఎత్తి, తాడు తగిలించి లాగేసరికి ధనుస్సు పెళపెళా నడిమికి విరిగిపోయింది. వెంటనే నా తండ్రి కన్యాదానం చెయ్యటానికి జలకలశం తెప్పించాడు. కాని రాముడు తన తండ్రి అనుమతి లేకుండా నన్ను పెళ్ళాడనన్నాడు. తరవాత మా తండ్రి అయోధ్యకు కబురు చేసి దశరథ మహారాజును రప్పించినాక మా ఇద్దరికీ పెళ్ళి జరిగింది."

ఈ కథ విని అనసూయ ఎంతో సంతోషించింది. ఆమె సీతను తన ఎదటనే అలంకరించుకోమని చెప్పి, తరవాత ఆమెను రాముడి వద్దకు పంపింది. రాముడు ఆమె అలంకరణలన్నీ చూసి, "ఇవన్నీ ఎక్కడివి?" అని అడిగితే అనసూయ ఇచ్చిన కానుకలని సీత చెప్పింది. రామలక్ష్మణులు పరమానందం పొందారు.

సీతారామలక్ష్మణులు ఆ రాత్రి అత్రి మహాముని ఆశ్రమంలో గడిపి, మర్నాడు సూర్యోదయం వేళ అత్రిమహాముని వద్ద సెలవు తీసుకున్నారు.

"నాయనా, ఈ అరణ్యంలో నరభక్షకులైన రాక్షసులు కూడా ఉన్నారు. మునులు ఫలాల కోసం అడవికి వెళ్ళి వచ్చేదారి చూపుతాను, ఆ దారినే వెళ్ళండి," అని అత్రి చెప్పాడు.

ఆయన చూపిన మార్గాన బయలుదేరి సీతారామలక్ష్మణులు భయంకరమైన దండకారణ్యం ప్రవేశించారు.

[ అయోధ్యాకాండ సమాప్తం ]



ప్రపంచపు వింతలు :

# 9. అమూన్ ఆలయం

క్రీస్తుకు పూర్వం 13 శతాబ్దాల క్రితం ఈజిప్టులో కార్నాక్ వద్ద మొదటి రామెసిస్ నిర్మించిన ఈ ఆలయం ఈజిప్టు శిల్పానికి గొప్ప నమూనా. ఆలయం వైశాల్యం 6 వేల చదరపు గజాలు. బొమ్మలో కనిపించే స్తంభాల వ్యాసం 12 అడుగులు, ఎత్తు 70 అడుగులు.





# ప్రశ్నోత్తరాలు

1. బి. జ్ఞానేశ్వరరావు, సికింధరాబాదు

అన్నయ్యా, భూమి పడమటి నుండి తూర్పునకు తిరుగు చున్నదిగదా, ఒక విమానము ఢిల్లీ నుండి ఎగిరి తూర్పు పాకిస్తానుకు ఎట్లు చేరుకోగలదు? విమానము పోతుంటే భూమి ముందునకు పోవుచుండును గదా!

భూమి యొక్క భ్రమణ వేగం భూమిపై ఉండే ప్రతి వస్తువుకూ ఉన్నది. భూమి చుట్టూ ఉండే గాలి పొరకుకూడా ఈ వేగం ఉన్నది. లేనట్టయితే గాలి వెయ్యి మైళ్ల వేగంతో తూర్పు నుంచి పడమరకు వీచి సమస్తమూ నేలమట్టం చెయ్యదా. రైలులో ప్రయాణించేటప్పుడు ఒక కుర్రవాడు బంతిని పైకెగరవేసి పట్టుకుంటే సరిగా చేతికే వస్తుందిగాని, రైలువేగం కారణంగా అది వెనక్కుపోదు. అలాగే భూమి మీద ఉండే మనుషులూ, విమానాలూనూ!

2. ఎస్. వి. జయకుమార్, బైరెడ్డిపల్లి

అన్నయ్యా, గుండు భీమన్న మరల వస్తాడా?

గుండు భీమన్నను రప్పించటానికి ప్రయత్నం చేస్తున్నాం. కొంచెం ఓపిక పట్టండి.

3. ఎస్. భారత్‌కుమార్, మహబూబ్‌నగర్

అన్నయ్యా, నీవు నూటిగా జవాబు చెప్పుతూంటావుగదా, ఏ పుస్తకములో చూసి చెబుతావన్నయ్యా?

ఒకటేమిటి? నా దగ్గిర ఎన్నో పుస్తకాలున్నాయి.

4. మధు, వేములవాడ

చందమామలోకి ప్రయాణానికి ఇంక ఎంతకాలం పడుతుంది, మామ?

చందమామ మీద దిగటానికి ఇంకా చాలా కాలం పట్టవచ్చు, కాని చంద్రుడి చుట్టూ ఒక ప్రదక్షిణం చేసి తిరిగి రావటానికి రష్యావారు సిద్ధంగానే ఉన్నారు. బహుశా అమెరికావారు కూడా సిద్ధంగానే ఉన్నారేమో.

5. *బళ్ళారి అమీర్ జాన్, పెనుకొండ*

అన్నయ్యా, మనదేశపు అద్భుతాలలో డిల్లీ ఎఱ్ఱకోటను గూర్చి ప్రచురించారా?

డిసెంబరు 1960 సంచికలో ప్రచురించాము

6. *'జేయస్సెస్', గుంటూరు*

"చందమామ" చేతిలో ఉండేవరకూ మొదటి నుంచి ఎట్లా తయారగునో తెలుసుకోవాలని ఉంది. తెల్ప గలరా?

ముందుగా కథలు తెలుగులో తయారవుతాయి. వాటిని కంపోజు చేసి పేజీలు పెడతాము. ప్రతి పేజీలోనూ పావు పేజీ బొమ్మకుగాని, అర పేజీ బొమ్మకుగాని చోటు వదులుతాము. పంక్తులు తగులూ మిగులూ లేకుండా సరి చేస్తాము. తరవాత ఆర్టిస్టులు బొమ్మలు వేస్తారు. కథలు ఫారాలు కట్టేటప్పుడు ఏ కథ కూడా కుడిచేతి వైపు పేజీలో ఆఖరవకుండా జాగ్రత్త పడతాము. తెలుగులో కథలు పేజీలు పెట్టగానే హిందీ, కన్నడ, తమిళ భాషలలోకి అనువాదం అవుతాయి. ఈ సంచికలో మీరు చదివే కథలు మే నెలలో తయారయినవి.

7. *ముమ్మన అప్పారావు, సింహాచలం*

అన్నయ్యా, నక్షత్రాలకూ, గ్రహాలకు భేదమేమిటి?

నక్షత్రాలు స్వయంప్రకాశం కలవి, సూర్యుడులాటివి. గ్రహాలు నక్షత్రాల చుట్టూ తిరిగేవి, స్వయం ప్రకాశం లేనివి. రాత్రివేళ మనం ఆకాశాన్ని ప్రతిరోజూ గమనించినట్టయితే నక్షత్రాల స్థానాలు మారవు, గ్రహాల స్థానాలు రోజు రోజుకూ మారుతాయి. అందుకే ఈ గ్రహాలను సంచార నక్షత్రాలని కూడా కొందరు పిలిచేవారు. కాని గ్రహాలు ఏ విధంగానూ నక్షత్రాలు కావు. రాత్రివేళ మనం వాటిని చూస్తున్నామంటే, సూర్యకాంతి వాటిపై పడటమే అందుకు కారణం.

8. *ఎ. బాలసుబ్రహ్మణ్యం, బరంపురం*

అన్నయ్యా, మహాభారతం అయిపోవచ్చింది. తరువాత మాకు అందించబోయే అట్ట చివరిబొమ్మ కథ ఏమిటో తెలుపుతారా?

మహాభారతం ఇంకా చాలా ఉన్నది.

9. *"శాంతి కిరణ్," విజయవాడ*

పెద్దగాలి వీచేటప్పుడు అప్పుడప్పుడూ సుడిగాలి వస్తుంటుంది. అది ఏమిటి? సముద్రంలో సుడిగుండా లెలా ఏర్పడతాయి?

ఎదురెదురుగా వీచే మారుతాల మధ్య సంఘర్షణవల్ల సుడిగాలి ఏర్పడుతుంది. అలాగే జలప్రవాహాల సంఘర్షణ చేత నీటిలో సుడిగుండా లేర్పడతాయి.

Photo by E. Ramalingam



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలవారము కాము

పంపినవారు :
బి. లీల, చీరాల

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

కష్టజీవులం మేము

పంపినవారు:
బి. లీల, చీరాల

# పుణ్యం - పాపం ★ [రామతీర్థ కథ]

ఒక ముసలమ్మ చచ్చి యమధర్మ రాజు దగ్గిరికి పోయింది. యముడు చిత్రగుప్తుడితో, "ఈ మనిషి ఏమన్నా పుణ్యం చేసిందేమో చూడు. స్వర్గానికి పంపుదాం," అన్నాడు.

"ఈమె ఒకే ఒక మంచి పని చేసింది. ఆకలిగొని ఉన్న బిచ్చగాడికి ఒక చిలగడదుంప దానం చేసింది," అని చిత్రగుప్తుడు చెప్పాడు.

ఇంకేం ఆ చిలగడదుంపను తెప్పించి ముసలిదాని చేతిలో ఉంచారు. చిలగడ దుంప స్వర్గం కేసి లేచింది. ముసలిది కూడా లేచింది. ముసలమ్మ స్వర్గానికి పోతూండటం చూసి బిచ్చగాడు ఆమె కొంగు పట్టుకుని తాను కూడా పైకి లేచాడు. మరొక ప్రాణి బిచ్చగాడి కాళ్ళు పట్టుకున్నది. ఇట్లా ఒకరి కాళ్ళు పట్టుకుని ఒకరు దండలాగా తయారై స్వర్గానికి బయలుదేరారు.

ఇంతమంది పట్టుకుని వేళ్ళాడు తున్నా ముసలమ్మకు బరువేమీ అని పించలేదుగాని, తన చిలగడదుంప మహాత్యంతో వీళ్ళంతా స్వర్గానికి బయలుదేరటం సహించలేక పోయింది. ఆమె తన కొంగు పట్టుకున్న బిచ్చగాణ్ణి తోసేస్తూ, "ఇది నా చిలగడదుంప," అన్నది. కాని ఆమె ఆ బిచ్చగాణ్ణి తోసెయ్యటం కోసం పైనున్న చిలగడ దుంపను వదిలేసింది. అందుచేత ముసలమ్మ, ఆమెను పట్టుకుని వేళ్ళాడుతున్న వారూ కూడా నరకంలో పడిపోయారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఆగష్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఆగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కలవారము కాము

రెండవ ఫోటో: కష్టజీవులం మేము

పంపినవారు: బి. లీల,

చీరాల, గుంటూరు జిల్లా.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

కర్ణుడి జన్మ వృత్తాంతమూ, అతని శాపాలూ విన్నమీదట ధర్మరాజు కుంతితో, "అమ్మా, నీవు ఈ రహస్యాన్ని ఇంత రహస్యంగా ఉంచ బట్టేగదా ఈ దారుణం జరిగింది. ఆడవాళ్ళ నోట రహస్యం దాగకుండుగాక!" అన్నాడు. ఆయన శోకతప్తుడై అర్జునుడితో, "ఛీ, ఛీ! రాజధర్మం కన్న బిచ్చ మెత్తటం మేలు. నాకు రాజ్యం వద్దు," అన్నాడు.

క్షత్రియ ధర్మంగా శత్రువులను చంపి రాజ్యం సంపాదించుకున్నాక దాన్ని విడిచి పుచ్చి బిక్ష మెత్తుకుంటానంటే అందరూ నవ్వుతారని అర్జునుడు చెప్పాడు. అందరినీ చంపకోక పూర్వమే బిక్ష మెత్తుకునే నిశ్చయం చేసి ఉంటే బాగుండేదన్నాడు భీముడు.

ఇందరూ ఇన్ని చెప్పినా మాట్లాడకుండా ఉన్న ధర్మరాజుతో ద్రౌపది, "కష్టాలు పడుతున్నంత కాలమూ తమ్ములతో మన రాజ్యం మనం తిరిగి పొంది సుఖపడతామని ఆశ పెట్టావు. అందుచేత తమ్ములతో సహా సుఖంగా రాజ్యం చెయ్యి," అన్నది.

"నీ ధనాన్ని భోగాలకే ఉపయోగించ నవసరం లేదు. యాగాలకు ఉపయోగించు," అని దేవస్థానుడనే ముని ధర్మరాజును హెచ్చరించాడు. హింస చెయ్యటం రాజ ధర్మానికి విరుద్ధం కాదని అర్జునుడు అన్నకు జ్ఞాపకం చేశాడు. వ్యాసముని అర్జునుడు చెప్పిన దాన్ని బలపరుస్తూ, సుద్యుమ్నుడనే రాజు క్షత్రియ ధర్మం అవలంబించి తరించిన కథ చెప్పాడు.

పూర్వం శంఖ లిఖితులనే ఇద్దరు బ్రాహ్మణ సోదరులుండేవారు. వారు ఒక నది ఒడ్డున, చెరొక ఫల వృక్షం చెంతా ఆశ్రమాలు ఏర్పాటు చేసుకున్నారు. లిఖితుడు ఒకనాడు అన్న ఇంటికి వెళ్ళి, అక్కడ ఆయన లేక పోయేసరికి చెట్ల పళ్ళు కోసుకుని వాటిని తింటూ కూచున్నాడు. ఇంతలో శంఖుడు వచ్చి, "నీవు చేసినది దొంగ తనం. రాజు వద్దకు వెళ్ళి, నీ నేరం చెప్పుకుని శిక్ష పొందిరా," అన్నాడు.

లిఖితుడు అన్న చెప్పినట్టుగా సుద్యుమ్నుడనే రాజు వద్దకు వెళ్ళి, తానొక పనిమీద వచ్చాననీ, కోరిక తీరుస్తానంటే చెబుతాననీ అన్నాడు. రాజు సరేనన్నాడు. అప్పుడు లిఖితుడు తాను చేసిన పని చెప్పి దండన కోరాడు. రాజు ఎంత చెప్పినా వినక తనకు దండనే కావాలని లిఖితుడు కోరటంచేత రాజు గత్యంతరం లేక అతని చేతులు నరికించాడు. లిఖితుడు శిక్ష పొంది అన్న వద్దకు వెళ్ళాడు. "నీ కిప్పుడు దోషం పోయింది. నీవు వెళ్ళి నదిలో స్నానం చేసి రా," అన్నాడు.

లిఖితుడు స్నానం చెయ్యగానే అతని చేతులు మళ్ళీ వచ్చాయి. అతను ఆశ్చర్యంతో ఈ విషయం అన్నకు చెప్పగా, ఆయన, "ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. నా తపశ్శక్తి వలనే నీకు చేతులు వచ్చాయి," అన్నాడు. లిఖితుడు మరింత ఆశ్చర్య పడి, "అలా అయితే ఆ తపశ్శక్తితోనే నాకు శుద్ధి కలిగించ లేకపోయావా? రాజు చేత దండన ఎందుకు చేయించావు?" అని అడిగాడు. "పిచ్చివాడా, నిన్ను దండించటంచేత రాజుకూడా శుద్ధుడయాడు," అన్నాడు శంఖుడు. ఈ సంఘటనతో ఆ నదికి బాహుదా అని పేరు వచ్చింది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'









అంజలీ పిక్చర్సు సమర్పించు..

# స్వర్ణమంజరి




డైరెక్షన్: వేదాంతం రాఘవయ్య   నిర్మాత. సంగీత దర్శకుడు: ఆదినారాయణరావ్

87

